## శ్రీ॥ శే॥ మ॥ ల॥ ముదునూరు సీతారామలక్ష్మణమ్మ వురఫ్ రామాయమ్మగారి జాతకము.

| | | |
|---|---|---|
| ర, ల | చం | శు, కు |
| శ | రాశి చక్రం | బు |
| | | ర, గు, కే |

| | | |
|---|---|---|
| రా, గు | చం | శ, బు |
| | అంశ చక్రము | |
| | | శు, ర, కు, కే |

సర్వధారిసం॥ర పుష్య శు ౮ బుధవారము. అశ్వని ౧ చరణము, శిరశ్శోదయకాలము ఘ 22–2 వి. ఘ. లు కాగా జననము, జననకాల కేతుమహదశా శేషము సం 6–మా 11–16 రోజులు.

(చిట్టిబాబుపంతులు జననిగారి జాతకము)

(న క లు)

విశాఖపట్టణమండలమందలి శృంగవరపుకోట తా॥ లూకా బోనంగిగ్రామమున, వారి పితామహులు శ్రీ॥ శే॥ మ॥ రా॥ శ్రీ నండూరి అప్పయ్య యావరహాలు పంతుగారి గృహమున జననము–

శుభమస్తు.　　ఓమ్.　　అవిఘ్నమస్తు

శ్రీ కాళీమాతేనమః.

# శ్రీ సీతారామ లక్ష్మణాంబికాంగశాస్త్రము

# (SREE SEETHARAMA LAKSHMANAMBI-KANGA SHASTRAMU)

## (అంగసాముద్రికశాస్త్రము)

వచ్చే సంపుటమున వాల్మీకి పూర్వపులాక్షణికుల నుదహరించెదను.






గ్రంథనిర్మాణకర్త :—

పండిత శ్రీ ముదునూరి చిట్టిబాబుపంతులు

విజయనగరము సిటీ కాపురస్తులు

తాత్కాలిక నివాసము:—రామచంద్రపురము.

మండలము తూర్పుగోదావరి.


సర్వహక్కులు గ్రంథకర్తవి.　　1958　　మూల్యము రూ 1—00

Embassy of India.
Moscow, 12 August, 1950.

Dear Sir,

I am directed to acknowledge receipt of your letter dated 2-7-50, addressed to His Excellency Dr. S. Radhakrishnan, and to thank you for the same. His Excellency hopes your efforts will succeed.

Yours faithfully
(Sd) * * *
Personal Assistant to
H. E. The Ambassador

Mudunuri Chittibabu.
Pandit of Angasamudrikam,
Ramachandrapuram.

(True copy)



కీర్తిశేషులు, మహారాజశ్రీ

## ముదునూరు వీరభద్రరావు పంతులుగారు

ఈ నవీనకాలమున అంగశాస్త్ర ప్రథమ పరిశోధనగావించిన
ప్రప్రథమ నిర్మాత. పాలకొండ కాపురస్థులు,
శ్రీ చిట్టిబాబు పంతులుగారి జనకులుంగారు



సద్గుణశీలురాలు, మహాలక్ష్మీ సమానురాలు

**ముదునూరు సీతారామలక్ష్మణమ్మగారు**

(ప్రసిద్ధ – నాగనాయమ్మగారు)

శ్రీ చిట్టిబాబు పంతులుగారి జనని గారు.



**పండిత శ్రీ ముదునూరు చిట్టిబాబు పంతులు**

అంగశాస్త్ర ప్రథమ, ద్వితీయ భాగములు, "శ్రీవీరభద్రరాయ"
అంగశాస్త్రము, శ్రీ సీతారామ లక్ష్మణాంబికాంగ
శాస్త్రముల సిద్ధాంతి.

**విజయనగరము సిటీ**
(మండలము విశాఖపట్టణము)

# శ్రీ సీతారామలక్ష్మణాంబికాంగశాస్త్ర భక్త కోటి

నెం. నామము. ఉపాధి. గ్రామము.

## తూర్పుగోదావరి జిల్లా – కాకినాడ తాలూకా

1. శ్రీ శ్రీ శ్రీ మేడపాటి కీ॥ శే॥ తమ్మయ్య రెడ్డిగారి జ్యేష్ఠపుత్రులు శ్రీ శ్రీ శ్రీ సూరయ్య రెడ్డిగారు
భూస్వాములు, సద్హృదయులు
షావుకారులు, గొల్లలమామిడాడ

2. చిరంజీవి మేడపాటి శంబూ అనే తమ్మయ్య రెడ్డిగారు, భూస్వాములు
గొల్లలమామిడాడ

3. శ్రీ ఇవటూరి జోగారావు పంతులుగారు, యం. బి. బి. యస్.
డాక్టరు కాకినాడ.

4. ,, ములుకుట్ల వెంకట లక్ష్మీనరసింహముగారు
విశ్రాంతి ఇంపీరియల్ బ్యాంకు కేషియరు. జగన్నాథపురం, కాకినాడ

5. ,, వీరంరెడ్డి వసంతరాయుడుగారు, భూస్వామి అచ్చంపేట

6. ,, తలాటం సోమరాజుగారు ,, ,,

7. ,, భమిడి వెంకటరమణమూర్తిగారు, పురోహితులు పెద్దాడ

8. ,, దెందులూరి వెంకటేశ్వర్లుగారు, పంచదారఫ్యాక్టరి సామర్లకోట
9. ,, వెలుగుబంట్ల నారయ్యగారు, జమీందారులు కూరాడ
10. ,, నూకల నరసింహంగారు, భూస్వామి ,,
11. ,, గోవర్ధనం పట్టాభిరామాచార్యులుగారు, వైద్యవిశారద ,,
12. ,, దేవులపల్లి వీరరాఘవశర్మగారు, ఘన వైద్యులు కాజులూరు
13. ,, మురుకుట్ల సూర్యనారాయణ మూర్తిగారు, భూస్వామి ,,
14. ,, బాలాంత్రపు వెంకట సుబ్బారావుపంతులుగారు
అసిస్టెంటు కరణము, దుగ్గుదుర్రు
15. ,, దంతులూరి వీరవెంకట సత్యనారాయణరాజుగారు
గ్రామమునసబ్ కోలంక
16 ,, కోనంభొట్ల పుల్లన్నశాస్త్రిగారు, పండితులు ,,
17. ,, మారిన వీరన్నచౌదరిగారు, భూస్వాములు వేళంగి
18. ,, తంత్రివాహి గుర్రాజుపంతులుగారు, బి. ఏ. యల్. టి.
భూస్వాములు, పెద్దపూడి

## పి ఠా పు ర ం తా లూ కా

1. శ్రీ బుర్రా అప్పలరాజుగారు (శ్రీవెంకన్నగారికుమాళ్లు)
భూస్వాములు మర్లాం
2. ,, సత్తనపల్లి కుక్కుటేశ్వరరావుగారు ,, పిఠాపురం
3. ,, చక్రవర్తుల వెంకటరమణగారు గ్రామమునసబ్, నవఖండవాడ
4. ,, కర్నిడి గోవిందరాజుగారు ప్రెసిడెంటు (పంచాయితీబోర్డు)
కొండెవరము
5. ,, పాలంకి దుర్గాప్రభాకరముగారు "వైద్యవిద్వాన్" భిషక్,
శ్రీసూర్యనారాయణ ఆయుర్వేదనిలయము ఉప్పాడ
6. ,, నాగాభట్ల కామేశ్వరరావుగారు
శ్రీ లక్ష్మి ఆయుర్వేదనిలయము ఉప్పాక

7. శ్రీ వైద్యరాజ పాలంకి సూర్యనారాయణకవిగారు
(వైద్యశాస్త్రగ్రంథకర్తలు) లలితాఆయుర్వేద నిలయము ఉప్పాడ
8. ,, ముద్దూరి రామసోమయాజులుగారు భూస్వామి కొమరగిరి
9. ,, వోలేటి కనకాచలం పంతులుగారు, కరణం ,,
10. ,, ఆకెళ్ళ బుచ్చివెంకటరావుగారు, భూస్వామి ,,
11. ,, సుందర కృష్ణమూర్తిగారు ,, గోరస
12. ,, గజరావు బుచ్చిపాపారావు దొరగారు ,, చేబ్రోలు
13. ,, లక్ష్మీగణపతి ఆయుర్వేద నిలయము, వైద్యము కొత్తపల్లి
14. ,, చెలికాని వెంకట ధర్మారావుగారు బారిష్టరు, (లండన్) చిత్రాడ

## రామచంద్రపురము తాలూకా.

1. శ్రీ వండూరి, కీ॥ శే॥ వెంకటరావు పంతులుగారి కుమారు
శ్రీ సూర్యనారాయణ శర్మపంతులుగారు, వెంటూరునివాసి
కో ఆపరేటివు ఇనస్పెక్టరు కోటిపల్లి
2. ,, యేడిద వెంకటరావు పంతులుగారు భూస్వాములు, యేడిద
3. ,, మందిన వెంకట సూర్యనారాయణరాజుగారు,
శ్రీ పార్థసారధి కోఆపరేటివ్ సొసైటీలిమిటెడ్
ప్రెశిడెంటు. రామచంద్రపురము, భూస్వాములు
అచ్చుతరామ వెంకటపతిపాలెము.
4. ,, వట్టికూటి పట్టాభిరామన్నగారు, జమిందారు వెల్ల
5. ,, కట్టమూరి సరప్పశాస్త్రిగారు, పండితులు వెంకటాయపాలెము
6. ,, కంటిపూడి వీరారాజుచౌదరిగారు, భూస్వాములు లొల్ల
8. ,, చేంబ్రోలు రామసుబ్బారావుగారు, ,, వల్లూరు
8 ,, ముత్యాలసత్యనారాయణగారు ,, ,,
యం. ఆర్. సి. సి. యస్. ప్రెసిడెంటు
9. ,, కళా వెంకటసుబ్బారావుగారు యల్. ఐ. యం. ద్రాక్షారామ

10 ,, అప్పల వెంకటరామశాస్త్రిగారు, కరణము — వెలంపాలెము

11 ,, ఖండవల్లి అనంతాచార్యులుగారు, ఘనవైద్యులు — దంగేరు

12. ,, సూధంశెట్టి చంద్రయ్యగారు, అనాసవైద్యులు — దాసరిపాడు

13. ,, పుల్యపూడి వెంకటేశ్వరులుగారు. పండితులు — కుందూరు

14. ,, వంటిపల్లి వెంకటనారాయణగారు, భూస్వా[illegible] — పెనికేరు

15. ,, శేషగిరిరావుగారి శ్రీ గణపతిరావుగారు
వ్యాపారము — రామచంద్రపురముటపును

16. ,, ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తిగారు
ఘనవైద్యులు — చింతలూరు

17 ,, ద్విభాష్యం సత్యనారాయణరావు రు
భూస్వాములు — చింతలూరు

18. ,, మెంతు వీరవన్న నాయుడుగారు, గ్రామమునసబ్ — పినపళ్ల

19. ,, పిడపర్తి సుబ్బారావుగారు బి. ఎ. బి. ఇడి.
ఉపాధ్యాయులు — పెడపర్తి

20. ,, మునునూరి సత్యనారాయణమూర్తిగారు, భూస్వాములు — పెడపర్తి

21. ,, విస్సాప్రగడ పళ్ళంరాజుపంతులుగారు కరణము — పెదపళ్ళ

12, ,, జోగావఝల భాస్కర కామేశ్వరరావుగారు
భూస్వాములు — ,,

23. ,, పెదపూడి వెంకటాచలపతిగారు డాక్టరు
రూరల్ ధర్మచికిత్సాలయము — ఆలమూరు

24. ,, వాడ్రేవు వెంకటసుబ్బారాయుడు పంతులుగారు
పెదకరణము — చొప్పెల్ల

25. ,, పేరూరి సూర్యారావుశ్రేష్ఠిగారు వ్యాపారము — ,,

26. ,, తిర్నాతి సూర్యనారాయణమూర్తిగారు ఆలమూరు
యల్. యం. బి. డైరక్టరు — చెముడులంక

27. శ్రీ డా॥ పెద్దింటి శోభనాద్రాచార్యులు
శ్రీ వెంకటేశ్వర ఉన్మాద వైద్యాలయము జన్నాడ
29. ,, యీ వెంకటాచార్యులు ,, ,,
29. ,, పైడికుక్కుల అప్పారావుపంతులుగారు భూస్వాములు కలవచర్ల
30. ,, అంగర వేంకటాచార్యులు & లక్ష్మణాచార్యులుగార్లు
సుప్రసిద్ధ ఉన్మాద వైద్యాలయము పెనికేరు
31. ,, కొప్పాక సత్యనారాయణమూర్తిగారు
పంచాయితీబోర్డు ప్రశిడెంటు పెనికేరు
32. ,, భావరాజు భీమశంకరంపంతులుగారు హెడ్ కరణం దొడ్డంపేట

## అమలాపురంతాలూకా

1. శ్రీ గంటిసోమశేఖరావుగారుకొబ్బరికాయవ్యాపారముబోడసకొర్రు
2. ,, గంటి రామగోపాల్ గారు ,, పేరూరు

## రాజమహేంద్రవరము తాలూకా

1. శ్రీ కాటూరి సర్వేశ్వరరావుపంతులుగారు భూస్వాములు కోలమూరు
2 ,, వెం. ల. క. మేడూరి సాంబమూర్తిగారు ,, నిడిగట్ల
3. ,, కొవ్విడి సత్యనారాయణపంతులుగారు ,, బూరుగుపూడి
4. ,, యీడిపుగంటి వెంకటరత్నంగారు ,, దుళ్ళ
5. ,, యన్నమని వెంకటాద్రియుడుగారు ,, ,,
6. ,, రెంటాల గంగరాజుగారు కరణం కాటవరము
7. ,, పోడూరి సీతారామారావుపంతులుగారు ఏ. యం. ఏ. సి.
ప్రత్యేక మేజిస్ట్రేటు 1వ తరగతి, బెంచి రాజమహేంద్రవరం
8. ,, చింతలూరి సాంబశివరావుగారు భూస్వాములు ,,

## భీమవరముతాలూకా (ప. గో. జిల్లా)

1. ,, పేరిచర్ల వెంకటరాజుగారనే సుబ్బరాజుగారు
భూస్వాములు ఎండగండి
2. శ్రీ భూపతిరాజు రామకృష్ణంరాజుగారు ,, రామకృష్ణపురము
3. ,, కలిదిండి విశ్వనాథరాజుగారు ,, పెద్దపుల్లేరు
4. ,, కలిదిండి నారాయణరాజుగారు ,, ,,
5. ,, కలిదిండి గొల్లరాజుగారు ,, ,,

## తాడేపల్లిగూడెం తాలూకా

1. శ్రీఆదంటవియ్యన్నపంతులుగారు,గవర్నమెంటుప్లీడరు బాదంపూడి
2. ,, పెడమర్తి వెంకటసుబ్బారావుపంతులుగారు, భూస్వాములువల్లూరు
3. ,, నూరంపూడి సుబ్బారావుపంతులుగారు, ధాన్యపువర్తకులు తాడేపల్లిగూడెం
4. ,, జూపల్లి వేణుగోపాలరావుదొరగారు,గ్రామమునసబ్, భూస్వాములు వెలగపల్లి

## ఏలూరు తాలూకా.

1. శ్రీ పూళ్ల వల్లభరాయుడు పంతులుగారు బి. ఏ, బి. ఇడి భూస్వాములు పూళ్ళ
2. ,, పెద్దింటి వేంకటాచార్యులుగారు ఘనవైద్యులు శ్రీ కృష్ణా ఆయుర్వేదఫార్మశీ ఏలూరు

## కొవ్వూరు తాలూకా

1. శ్రీ నండూరి రాఘవరాజు పంతులుగారు, రిటైర్డువోవర్ సీరు కొవ్వూరు
2. శ్రీశ్రీశ్రీ, సారస్వతము కొవ్వూరు
3. శ్రీశ్రీశ్రీ, స్వతంత్రోద్యమము సంవత్సరగూడెం
4. శ్రీతటవర్తి వేంకటరమణయ్య పంతులుగారు బి. ఏ. బి. ఇడి సహాోపాధ్యాయులు. మాండలికోన్నతపాఠశాల, నిడదవోలు

## హైదరాబాదు

1, శ్రీ ఇరంగంటి రంగాచార్యులుగారు యం. ఏ. బి. యల్ అడ్వకేటు హైదరాబాదు

## నెల్లూరుజిల్లా—నెల్లూరు తాలూకా

1. శ్రీమతి ఇందుపూరి బుజ్జమ్మగారు, భూస్వామి పోట్లపూడి
2. శ్రీ కట్టా దశరథ రామిరెడ్డిగారు, ,, క్రొత్తపాళెం
3. ,, పొక్కిరెడ్డి శేతువు రామిరెడ్డిగారు, ,, అల్లిపురము
4. ,, గోపాలుని శంకరయ్యపంతులుగారు, ప్రధానోపాధ్యాయుడు చెన్నపల్లిపాళెం

శ్రీ ఊరుబిండి శేషశాస్త్రులుగారు, పురాతన సంస్కృతపండితులు ఊరుబిండివారి ఖండ్రిక

ఓమ్.

శ్రీకాళీమాతే నమః

# శ్రీసీతారామలక్ష్మణాంబికాంగశాస్త్రము



## పీఠిక.



'మాతృదేవోభవ, నమాతుఃపరదైవతం' అను శృతిస్మృతుల ననుసరించి మాత ప్రథమోపాస్యదైవము, ఏలయన శుక్లార్తవములు మాతృగర్భమున సంయోగించి ప్రథమమున కలలరూపమును, పిమ్మట పిండరూపమును,అనంతరమున కరచరణాద్యంగములును, నేర్పడును. తదనంతరము (పంచప్రాణాత్మకహిరణ్యగర్భుడు) జీవుడు ప్రవేశింప శిరమున నొకరంధ్రముండును. అదియె బ్రహ్మరంధ్రము. జీవాత్మమాతృగర్భస్థశిశువునందుఁ బ్రవేశించినంతనే చలనమారంభమగు. గర్భస్థశిశువువలన గలుగు బాధలసహించుచు, తనయాహారసారమే శిశుపోషకమగుటచే మాతృదేవి పరిమితముచేసి గర్భస్థశిశువునకు నిర్బాధకముగ భుజించును, గర్భగత శిశువువలనఁ గలుగు శ్రమలను సంతోషముగ ననుభవించును. భూపతనము మొదలు జ్ఞానోదయమగువరకు శిశుసంబంధ మలమూత్రాదుల శరీరమున నింకించుకొనును. శిశువు పంచవర్షప్రాయమునొందుతఱి, మాతయే సరస్వతీరూపయై 'ఓం నమశ్శివాయ" ఓం నమోనారాయణాయ' అను విద్యాపరసాధకములగు నక్షరముల నక్షరాభ్యాసమనుమిష నుపదేశించును. శిశు, వజ్ఞానమున జేయుపాపములఁ దానేభరించును. బిడ్డకెట్టిబాధ, కోపముకలుగకుండ జాగరూకతకలిగియుండుట లోకమున సహజము గదా! స్వమాతృవిషయము:- నేను భూపతనమైనది మొదలు 11 దినముల వఱకు దృష్టి రాలేదట. 5వత్సరములు పూర్తియగువఱకు మాటలురాలేదట,

ఇట్టిస్థితిలో నున్నను కడుప్రీతిపిచే నెట్టిలోపము కలుగకుండ నామాతృదైవము రక్షణమొనర్చెను. పిదప సంభాషణాదులు అలవడగనే, స్వీయధనముచెచ్చించి హార్మోణవిద్య నభ్యసింపజేసెను. ఆమెమరణకాలమున నామె హక్కు యనుభవములనున్న సౌధమును పెరటినివేశనముతోగూడ నాకు చెందచేసెను. ఉదరరోగముచే బాధనొందుచున్నను, నేనెక్కడ నెట్టియాతిబాధలనొందుదునో యనుమనోవ్యథతో, ప్రాణోత్క్రమణమునకు ముందు యిరువదిమూడుగంటల కాలము శ్రీనివాసుని సగుణరూపపటమును మున్నిడుకొని మానసికారాధనచేయుచు శ్రీవేంకటేశ్వరసాయుజ్యమునకేగి, నే నేకాకిగనగుటకు ప్రథమసోపానమును నిర్మించెను. నేను జనించినదిమొదలు 18 సం॥రములు కడచువఱకు నిత్యరోగిని. నారోగమునకు విచారించుచు నాజననీజనకులుండెడివారు. సహజముగజనని గావించు సేవ లధికములై యుండును, అట్టిరీతిగ బెంచి నన్నీస్థితికి దెచ్చిన నాజననిఋణమును, ఈగ్రంథమునకు, వారిభౌతికదేహనామమిడి, సహస్రాంశమైన ఋణవిముక్తినొందుటయె గాక, శాశ్వతజ్ఞాపక చిహ్నముగ నామాతృభాషను వ్యవహరించు (వాడు) ప్రదేశములలో నిలుచునట్లుచేయుట కీగ్రంథనామమును "శ్రీ సీతారామలక్ష్మణాంబికాంగశాస్త్రము" అని వ్యవహరించితిని- నాలేఁబ్రాయమున తెలుగు వ్రాయలేనితరి తాళములగుత్తితో నాతలపై నామెకొట్టెను. అజ్ఞానినగుటచే 1½ గంటలకాలము రోదనమొనర్చినను, ఈగ్రంథముతో క్లినీయపూర్వాంగశాస్త్రమును నాలుగుసంపుటములుగ ముగింపగలిగినందులకు, నా యీ స్థూలోపాధికి హేతుభూతయగు మాతృదేవతకు, ప్రతియుచ్ఛ్వాసనిశ్వాసకాలమునందును నమస్కరించుచుంటిని. నాజ్ఞానగ్రంథి విడునట్లుచేయ ననేకశ్రమలొందిన నాజననీజనకులకు నిత్యనమస్కృతులొనర్చుచుంటిని. నాతండ్రిగారు నాబాల్యమున విద్యనలవడుజేయుతలంపున పెక్కుసారులు భియపెట్టుచుండెడివారు. ఇట్టికృషులొనర్చుట తల్లిదండ్రులకు స్వతస్సిద్ధములు. మాతాపిత

ళలో మాతయందు మఱియొకయాధిక్యముకలదు. అవిశేషమే దన-కుమారుడు ప్రాపంచికసమస్తసుఖవిరాగియై తురీయాశ్రమమును స్వీకరించినను జననికి ముందుగ నమస్కరింపవలెను. ఆశ్రమస్వీకారమున కామెయనుమతి పొందవలెను. కాషాయ వస్త్రముల ధరించినమాత్రమున యతి సర్వలోకపూజ్యుడగు. అట్టి యతికిని ప్రథమోపాస్యదైవము. మాత, జనకుడు లోకులలోనొకడు గాన సన్యాసి కుమారుడైన, నాతనికి నమస్కరింపవలెను. కని పెంచుటయె గాక నిట్టియాధిక్యతగూడ తల్లియందు కలదు. రుచికల యాహారమిడుచు, నోళ్లముల గోప్యముగావించుచు. బిడ్డలయానందమే తనయానందము భావించు మాతయొక్క ఋణమును దీర్చుశక్తి లేదుకదా! మాతృ ప్రేమ బ్రహ్మపదార్థమువలె వర్ణనాతీతము.

ఈగ్రంథాంతమున "అంగశాస్త్రము" అని యుండును. (a) అనగా మానవశరీరమందలి సర్వాంగప్రస్తావన- (b) మానవశరీరమందలి సర్వాంగసౌష్టవసాముద్రికప్రపచ్చము— c. శరీరమందలి సర్వరేఖాప్రసక్తి- (d) మానవశరీరమందలి సర్వస్థానవిమర్శయనెడి చతుర్విధంబులు- వీనినాల్గింటియాభాగమున ద్వాదశభావ నిరూపణమొనర్చుచున్నాడ— ఈశాస్త్రము జ్యోతిషశాస్త్రము కాదు— హస్తసాముద్రికమును గాదు- కాని పైరెండుశాస్త్రముల కాధారపీఠమగుశాస్త్రము (మాతృక) ఈమూడుశాస్త్రములును మానవజీవితమున సంభవించు ద్వాదశభావనిరూపణమొనర్చును- ఈశాస్త్రమున తెలుపుఫలితములలో గొన్ని కొన్ని కొందరికే వర్తింపబడును—

నాయొక్క ప్రతిసంపుటములయందున (పుస్తకభాగములందు) ద్వాదశభావ నిరూపణాపూర్వకముగ విషయములుండునని భావింపరాదు. ఈశాస్త్రము కడునూతనము. మద్బాల్యారంభమునుండి నాతండ్రిగారైన ■ శ్రీ॥ మ॥ రా॥ శ్రీ ముదునూరు వీరభద్రరావు పంతులుగారివలననీసు మొత్తమున విమర్శించుచు యుండెడిరి. నా చిన్నతనమున నాజనకులు వైజయ

వగరమున విశ్రాంతిగనుండు కాలపరిమితిలో మాత్రము నాకీశాస్త్రము నుపదేశించుచుండిరి. ఈశాస్త్రము నాలుగు విభాగములని యితఃపూర్వమే తెలిపియుంటిని. అవగా ప్రతియంగమునకు ముద్రణచేయుటకు ద్వాదశ భావఫలములు అట్టియంగములలో నేవియేవియుండగలవో తేటపఱచుట కీశాస్త్ర సాంప్రదాయము మిక్కిలి మార్గదర్శకము. పూర్వము వేదములు, భాష్యములు, కావ్యచంపూనాటక పురాణాదులన్నియు దేశభాషలలో ననువదింపబడిన్నవి. సంస్కృతభాష వ్యవహారమునుండి యంతరించు స్థితిలో మాతృభాషావాఙ్మయములందు గద్యపద్య గ్రంథములే యంతరించినవి. జ్యోతిషము, ఆయుర్వేదము, హస్తసాముద్రికము మొదలగువానిని పూర్ణముగగాక, భాషావ్యత్యాసస్థితులనుబట్టి విమర్శించిరి. వాని నన్నిటిని నాపితృపాదులు, వారివిద్యాభ్యాసకాలమునం జదివియుండుటవలన నంగశాస్త్రము నొక ప్రత్యేకశాస్త్రముగ నెంచి దానియందు పూర్ణముగ మనస్సిడుటచేత, జీవితకాలమంతయు నీశాస్త్రముతోడ, ద్వాదశభావ ఫలప్రదర్శనమునకై నూతనపరిశోధనలను గావించుటయే పరమావధిగ నెంచిరి. నామొత్తపు సంపుటములన్నియు ముగిసినతోడనే ద్వాదశభావముల సక్రమముగనే ఏర్చి యెంచుకొనవచ్చును. నాయన్నివిభాగముల నింకను వ్రాయుచునే యుంటిని. గ్రంథవిస్తరభీతిచే నే నెంతక్లుప్తీకరణ దృష్టితో నున్నను, మానవులకందరకు తెలియునట్లు శాస్త్రముండవలయు ననుతలంపుతో వ్రాయుచుంటిని. నాయీశాస్త్రము, అజ్ఞ, విజ్ఞ, భేదములేక యందఱకు మోదమును కలిగించురూపమున నుండవలయునని నాకుతూహలము. ఇట్టిరచన పైరెండు తెగలవారినిగూడ నానందపఱుచును. ఇందు భాషకంతగా ప్రాముఖ్యతనిడలేదు. శుక్రసంహితాదిగ్రంథములందుగూడ భాషకన్న భావమునకే ప్రాముఖ్యత కానవచ్చుచున్నది. అభిలషించువారందరు చదువుట కనువగురీతిలో నీశాస్త్రమును భాగ విభాగము లొనర్చుచు, ముద్రించుచున్నాడను. జ్యోతిషశాస్త్రమున కాది

కీతశాస్త్రమను దానిలో భావప్రాధాన్య మిట్లు గణించుచున్నది. బిడ్డ పుట్టినపో ద్వాదశభావములు తెలియుటకై నవగ్రహములను చక్రముల యందు నిరూపించుచుంటిమి. అట్టితరి యీ దిగువ పేరాలయందు విమర్శనా రూపముగ తెలుపబడిన భూపతనాదులు వ్యత్యాసముగా వర్తింపబడిన, చక్రములనుబట్టి ఫలములును వ్యత్యస్తమగుచున్నవి. అనగా ఫలనిదర్శ నము లేదు. ఇట్టిచర్యలకు తావు బిడ్డజననమే కావున, బిడ్డయందే నవగ్రహము లుండుటవలన (అంగములయందే గ్రహస్థానములు) శిశువునుబట్టియే ద్వా దశభావఫలనిరూపణ మొనర్పనిదియె పరమావధియని యంగశాస్త్రము యొక్క ముఖ్యాభిప్రాయము. హస్తసాముద్రికమునందు తాత్కాలిక రేఖలు కొంతకొంత నిర్ణీతకాలములందు మారుటయు, గతశాస్త్రదృష్ట్యా లో సప్తగ్రహములే పరిగణింపబడుటవలన, ప్రస్తుతమిందు కుజస్థానమును రెండుస్థానములుగా నవీనులు విభజించుటచేతను, ద్వాదశభావవిచార ణయు, విచారణ కావించి ఫలమునొందుట, బహుకష్టస్థితిలో నున్నది. కావున నసంపూర్ణవిషయముగ నున్నది. శ్రీ వరాహమిహిరుని కాలమున సప్తగ్రహములు గలవని చెప్పుట సమంజసముకాని, క్రీస్తుశకమగు నీకాల మునగూడ నట్టిరీతిగ సప్తగ్రహములనే యాపాదించి నిర్ణయించుటగాని, పైవిధముగ నొకగ్రహమును ద్వివిధముగ విభాగమొనర్చుచు ద్వాదశ భావవిమర్శనము గావించి సాధింపబూనుట యసంపూర్ణవిమర్శన మన బడును. ఈనాడు జాతక, సిద్ధాంత, ముహూర్తాది భాగత్రయవిశిష్ట జ్యోతిషమునందు, పంచాంగములందును నవగ్రహములు కానబడుకాల మున, నొక్క హస్తసాముద్రికశాస్త్రమున ద్వివిధరీతులుగ, నేడు వ్యవహ రింపబడుట యసంపూర్ణత్వమని యభిప్రాయము నొందవలసినదేకదా? ఇది లోకశాస్త్రము. బుద్ధిసహాయమున నొకవిషయమును గమనింపుడు. ఒకని రెండుచేతులును వ్యాధివలనగాని, మరియే కారణముచేగాని, చికిత్స కుడు ఖండించిన నామానవునకుఁ గలుగవలసిన రాజయోగావయోగాదులు

ఫలశూన్యములగునా? కాలేదు. కాన సారాంశమేమన మానవుని కంఠ భాగమునుండి యసువులు వెడలు పర్యంతము సర్వశరీరసంబంధములగు రాజయోగావయోగములు రెండును సంభవించుచునే యుండును. కాని యొకానొక యంగమగు హస్తము లోపించిన యోగములోపింపదు. గాన సర్వాంగశాస్త్ర విమర్శనమొనర్చి, ఫలనిర్ణయమొనర్చుట యుత్తమ పద్ధతి. నేడు మానవుల కంఠఅరును నోటింగుహాన్కున్నట్లు, సర్వాంగ ములకు రాజయోగావయోగములు స్వతస్సిద్ధములు. కాన సర్వాంగ శాస్త్రమే ప్రధానము. పూర్వకాలిక వేదశాస్త్రాదులు హీనస్థితి నొంద బడుటకు కారణము. గురువులు శిష్యులకు ముఖాముఖిని బోధించుటయే కారణము. ఆపద్ధతిగ నేనీశాస్త్రమును నాజనకునొద్ద నభ్యసించితిని. కాన నిట్టితరిగూడ గురువులు ద్వివిధరీతులలో సనాతనబోధనలు జరుప బడుచుండెడివి. (1) వంశానుక్రమణిక, (2) గురుసాంప్రదాయము. ఈరెండు తరగతులలో విషయములు గురువులుచెప్పినవి. మిగిలిన మూడును శిష్యుడలవరుచుకొనవలసినవై యున్నవి. 1. గురుసాంప్రదాయము, 2. శాస్త్రబోధ. 3. అనుభవము అన గురువుల యనుభవములకు జేర్చ బడినట్టియు, నవీనాచార్య అనుభూతులతోగూడ, అనియర్థము. 3. తాత్కాలికబుద్ధి విమర్శనంబు మానవవ్యత్యస్థ బుద్ధికలవడునట్లుగా విషయముల విపులీకరించుట. శాస్త్రబోధనమన (1) గ్రహించుట, అధీతి, బోధ, ఆచరణ, ప్రచారణములను నాలుగింటిలో ప్రథమము అధీతి (గ్రహించుట) బోధ:- విమర్శనీయముల దాగ్రహించినది యితరులకు దెలియునట్లు తెలుపుట అనియర్థము. విదులగు గురువులు తాము బోధించినవానినాచరించి వానిఫలముల శిష్యులకు విశ్వాసజ్ఞానముల నలవరచుటకై వ్యక్తపఱచుచుండిరి. శిష్యులు గురూపదిష్టమార్గముల నవలంబించి సారళంభులగుచున్నారని భావింపవలసి వచ్చుచున్నది. ఇయ్యది విద్యాభ్యాస

కాలమున విద్యావిషయక విమర్శనమున వెల్లడియగుచున్నది. కావున, గురుసాంప్రదాయముకన్న వంశానుక్రమణికలో, స్వీయవంశీయులనుభవ పూర్వకములగు శాస్త్రవిషయములను ముఖ్యముగ గ్రహింపజేసి సాన పట్టిన రత్నములట్లు ప్రకాశింపజేతురు. గాన వంశక్రమాగతవర్ణోత్పత్తి క్రమము ననుసరించుట సులభము.

శ్రీ వాల్మీకి. మహామునీంద్రుడు స్వవిరచిత రామాయణకావ్యము నందలి సుందరకాండమున 35వ సర్గయందు 17 శ్లోకము మొదలు 20వ శ్లో॥ వఱకును, యుద్ధకాండమున 48 సర్గయందు 2వ శ్లోకమునుండి 14వ శ్లోకములందును అంగశాస్త్ర ప్రశంస చేసియుండుటయేగాక తనకు పూర్వమునగూడ లాక్షణికులు గలరని నుడివియుండెను. లాక్షణికులనగా సర్వశరీరావయవగత లక్షణముల బరిశీలించి రాజయోగావయోగాదుల నిరూపించెడివారని యన్వయించుకొనవలయును. ఈ యంగశాస్త్రము వాల్మీకికి బూర్వము కలదని రూఢియగుచున్నదికదా! సీతాదేవియొక్క దేహమందలి లక్షణములను, చక్రాదిరేఖలను జూచియు, నామెశరీర మందు (1) సత్యసామములనియు, (2) పద్మరేఖలనియు, ధ్వజాది శుభ లక్షణములనియు, సుప్రసిద్ధలాక్షణికులు, మహాజ్ఞానులు, మహర్షులు సుల క్షణము లిట్టివియని పేర్కొనిరి. లక్షణమనునది సౌందర్యమును దెలు పును. వాల్మీకికిం బూర్వమునగల సుప్రసిద్ధ లాక్షణికనామములగూర్చి నేనెంత కృషిచేసినను నాశ్రమయంతయువమ్మయ్యెను. అందము, చక్క దనము, సౌందర్యము, అనుపదములు పలుభేదములతో నొప్పు సౌష్ఠవవిష యములుగ నున్నవి. అనగా భిన్నభిన్నాకృతులతో నొప్పు అంగసమ్మే ళనములయొక్క రీతియె సౌష్టవరూపముల నిడును. అనగా అంగాకృతుల యందు సౌష్టవభేదమనియు (1. ఏకవస్తువిమర్శ) అంగముల సముదాయము వలన నేర్పడెడి సౌష్ఠవము వేరనిగూడ యెరుంగునది. (2. పలువిమర్శ)మ

వస్తువిమర్శ) ఇట్టివి మహాకావ్యములని పేర్కొనబడు మారసంభవాది సుప్రసిద్ధ గ్రంధములందు తెలుపబడినవి.

పిమ్మట శ్రీయాజ్ఞవల్క్యమునియు నీలక్షణముల బట్టియే చక్రవర్తితో మరణవిధులనుగూడ నుడివినాడు. ఈవిషయమే శ్రీమదాంధ్రమహాభారతము శాంతిపర్వమునందు షష్ఠాశ్వాసమున(241పుట)గూడ నీవిషయము కాననగు. ఇట్లే మరణలక్షణములు జైమినిమునిచే లిఖింపబడిన భారతము అశ్వమేథపర్వమును నాంధ్రీకరించిన శ్రీ పిల్లలమర్రి పినవీరభద్రకవియు జంద్రహాసచరిత్రయందు దత్తాత్రేయునకలర్కుడు, కుంతలదేశనాథుడు తనమూర్ధము కానరాకుండుటవలన రాజ్యలక్ష్మియందలి మోహమును వీడెదనని, తన నిజపురోహితుడగు గాలవమునినిజూచి యరిష్టలక్షణంబు లడిగినతరి గాలవుడిట్టివానిని దెలుపుచు మరణవిషయములను, తత్కాల పరిమితులనుగూడ వివరించియుండెను.

శబ్దార్థకల్పద్రుమమునందు 'పంచదీర్ఘం ప్రశస్యతె' అనుశ్లోకాను సారముగ నైదుదీర్ఘముల నొందవలయుననియు, 4 హ్రస్వముల నొంద వలయుననియు, 6 ఉన్నతములై యొప్పవలయుననియు, 6 రక్తవర్ణముల నొందవలయుననియు, 3 గంభీరము నొందవలయుననియు, 3 విశాలముగ నుండవలయు ననియు, నిర్ధారింపబడినది. అనగా నంగములగూర్చి విమర్శయై యున్నది. (ఇట్లన్నియు వర్తించిన రాజయోగప్రదము.)

అష్టాదశపురాణాంతర్గత స్కాందపురాణమున నేబదిఖండములలో కాశీఖండమొకటి. అందు స్త్రీ లక్షణములు కొంతవఱకు వివరింపబడెను. గాన శ్రీనాథకవీంద్రుడుగూడ నీయంగలక్షణముల గొన్నిటినైన పరిశీలించెనని నుడువవలసి యున్నది. 1. ఆకృతులు, 2. రేఖలు, 3. రోమము 4. పరిచితిస్థానము పరిశీలించుటయేగాక, పరిశీలనాసాధ్యములగు 1. యోని, 2. పుట్టెలు, 3. జిహ్వ, 4. తాళువు, 5. హసితము. పరిశీలనంబు లూహించువిషయమున శ్రీ శ్రీనాథకవీంద్రుని చేనోళ్ళ నుతింప వలసియున్నది.

కవికులతిలకుడగు కాళిదాసమహాకవీంద్రుడు తన మహాకావ్యములలో "కుమారసంభవము" ప్రథమసర్గయందున నీయాంగికలక్షణశాస్త్రమును నిర్ధారణగావించుచు 33, 34 శ్లోకములు, 36 శ్లో॥ మొదలు 40, 42 44నుండి 49 శ్లోకమువఱకును, ద్వితీయసర్గయందు 18వశ్లో. తృతీయసర్గ 45-54-56-67 శ్లోకములు, పంచమసర్గలో 4-15-19-24-27-29-34-49 శ్లోకములలో నీవిషయము విశదీకరింపబడినది. ఇందు 24వ శ్లోకము మిక్కిలి ప్రధానము. షష్ఠస్సర్గయందు 25 84శ్లోకములుగూడ నిట్టివే.

ఈ పైశ్లోకములన్నియు నంగశాస్త్రసంబంధమైనవి. శ్రీ కాళిదాససూచిత విషయములనే మరికొన్నిస్థలములలో జెప్ప యంగశాస్త్రనిరూపణమును గాఢరూపస్థితి యొనర్చెనని చెప్పక తప్పదు. తృతీయసర్గయందలి 45 శ్లోకము పురుషసాముద్రికమును, పంచమసర్గయందలి 49శ్లోకము సాధారణలక్షణ ద్యోతకమై యున్నది. 6వ సర్గయందలి 25శ్లోకము పురుషసాముద్రికమును, విపులీకరించుచున్నది. ఈకవివరునిచే రచింపబడిన మేఘసందేశమునందు ద్వితీయసర్గయందు 21శ్లోకమునందు స్త్రీ సాముద్రికము వర్ణింపబడియె, ఈగ్రంథరాజములయందు స్త్రీసాముద్రికవిషయ ప్రశంసయే యధికముగ నొనర్పబడెను.

శ్రీవాత్స్యాయనుడు రతిరహస్యమను గ్రంథమందు పద్మినీజాతి స్త్రీ వర్ణనమును గావించియున్నాడు.

మానవశరీరమందు నవగ్రహములు గలవని యట్టి గ్రహబలము యొక్క చలనము మానవునియందే జరుగుననియు, అట్టిగ్రహమండలములకు స్థానము స్థూలశరీరము. కావుననే సత్కర్మనుగాని, దుష్కర్మనుగాని మానవుడే యనుభవించును. అట్టికర్మలను మానవశరీరమే యనుభవించును గాన నీశాస్త్రము ననుసరించి చెప్పెడిఫలము లిసుమంతయు తారుమారు కావు. ఇట్టివిషయములు స్థూలోపాధిని గలవని గహనునిచే [illegible]ంపబడిన విషయము.

సటీకా సీతారామాంజనేయ సంవాదమునందలి 24వ అఖండ మూర్తియైన పార్వతీదేవి యఖండవిజ్ఞానవంతురాలైన స్వభావమనునది జీవసంబంధము. అతిశయమనునది సంస్కారముల ననుసరించి ప్రాప్తంబు. అతిశయములేని స్వభావము పార్వతీదేవి నొందెనని నాయభిప్రాయము. అట్టిస్వభావమునే మహోన్నతస్వభావమని యెఱుంగునది. అట్టిస్వభావమున్నకు అంగశాస్త్రమునందలి నాలుగువిధముల విభాగరూపములైయున్న పద్ధతులలో నుత్తమోత్తమపద్ధతులుగ గణింపబడు 1 అంగములు, అంగవిభజనసౌష్టవములు 2 అంగముల సమ్మేళనమైన యంగసౌష్టవములును, 3 యావచ్ఛరీర రేఖలును. 4 శరీరమందలి సర్వస్థానములును, రాజయోగము నిదువానినే పార్వతీదేవి పొందినదనియు, కావున నేజ్ఞానయుతయు, మహాపతివ్రతయు నైనది. దేహలక్షణములకును, స్వభావమునకును, కడుసన్నిహితబాంధవ్యము కలదని నిరూపింపబడినది.

ఇట్టి పరమ పవిత్రమైన స్థూలోపాధియే నవగ్రహమండలము. ఇట్టి శరీరమునందే అధిదేవత, ప్రత్యధిదేవతాస్థానముల నిర్ణయింపనగు. ఇట్టి నవగ్రహములకును, దశవిధవాయువులకును సన్నిహితబాంధవ్యము గలదు. ఈదశవిధవాయువులు అమరనిఘంటువునగలవు.

రామాయణాది మహాకావ్యములందును, కాళిదాసాదిమహాకవుల యుత్కృష్టగ్రంథరాజములందును, నీవిధముగ పెక్కుగ్రంథములయందును కానబడుచున్నది. భాషాంతరీకరణ గ్రంథములందుగూడ, అనువాదకర్తలుగూడ నచ్చటచట సూచించియున్నారు. కావున నంగశాస్త్రమను నీమహాశాస్త్రము నెమ్మదినెమ్మదిగా వృద్ధినొందుచునే వచ్చుచున్నది. అట్టి పెక్కువిషయముల నిందుదహరించిన, పీఠిక విస్తీర్ణత నొందుననుభీతితో నింతలో నీవిషయమును విరమించుచుంటిని. నవీనులుకూడ నెట్టిదృక్పథములోనైనను నట్టివ్రాతలను వ్రాయుచునే యున్నారు. ఇందు కాలానుగుణముగ వ్రాతలను వ్రాయుచునే యున్నారు. ఇందు కాలానుగుణ వేషభాషాదులు ఆకాలములందలివారి కాకర్షకముగ నుండెను.

వ్యాసశిష్యుడగు జైమినిముని సూత్రరూపమున జ్యోతిశ్శాస్త్రమును రచించెను.

శ్లో. ఆరూఢంచ కోశయానంచ మంత్రిందారపదంతథా।
భాగ్యం రాజ్యం చోపవరం అష్టారూఢాః ప్రకీర్తితాః॥

అష్టపదముల ననుసరించి యారూఢచక్రానుసారము ద్వాదశభావ ఫలనిరూపణ మొనరించెను. ఇందు బ్రహ్మ, రుద్ర, శూలి మొదలగు పారిభాషికములద్వారా ద్వాదశభావఫలములను లోకవ్యక్త మొనర్చిరి. జ్యోతిషశాస్త్రమునందె పరాశర, జైమిని యను భేదస్థితులతో ఫల సారానుక్రమముల ద్రొక్కుచున్నవారు. అధికాల్పములతో గూడిన యాధిపత్యములతో ద్వాదశభావనిరూపణ, శాస్త్రానుభవయుతముగ ఋషులు దీర్ఘపరిశ్రమాభినివేశములతో లోకకళ్యాణమునకై యొనర్చియున్నారు. అట్టిచందమున నేనొనర్చు కృషికూడ సార్థకమై, లోకోపయోగియై పరిగణింపబడి లోకమున సుస్థిరత్వమునుదాల్చి శాశ్వతోపయుక్తశాస్త్రమై విరాజిల్లగలదని నాదృఢవిశ్వాసము.

ఏశాస్త్రముయొక్క పారిభాషికము లాశాస్త్రములపై యుండును. జ్యోతిషమందలి భిన్నభిన్న మతములవారు భిన్నభిన్న పారిభాషికనామములు వాడుచున్నారు.

శిశుజననమునకు యుక్తకాలములు 1. బిందుపతనము (గర్భధారణ క్షణికకాలము) 2. శీర్షోదయము, 3. భూపతనము. ఇందుహంశము కనిపెట్టి నిచ్చు యీనాడడుగంటినది. శీర్షోదయమునకు, భూపతనమునకు కాలవ్యవధులు గోచరించుచున్నవి. ఇట్టిస్థితిలో సర్వప్రాధాన్యత (స్వరశుద్ధి వాయువు)ను కనుగొని జ్యోతిషశాస్త్ర మతములద్వారా ఫలనిర్ణయ మొనర్చుటయొక్క విధాతకే యట్టివిధి మాత్రమై యుండవలయును గాని నరులు సాహసించుట హాస్యాస్పదము. ఏలయన భూపతనమైన

సర్వేంద్రియ చైతన్యము సర్వము శరీరమున వ్యాపించినను, విరుద్ధాహారము శాస్త్రవిరుద్ధమైన కాలములయందలి సంయోగములు, పురాణవ్యాధితత్వములు, వంశపారంపరిగ వచ్చుటవలన క్లిష్టము. ఇప్పటి శరీరతత్వములు అభ్యాసములవలన నుష్ణించిన శరీరతత్వ సంతతులయెడ ఉచ్ఛ్వాస నిశ్వాస కాలనిర్ధారణారంభ క్షణికానుసారముగ ద్వాదశభావఫల నిరూపణమొనర్చుట దుర్ఘటము. వైద్యశాస్త్రరీతిగ పురాతనమునగాని, నవీన కాలస్థితిలోగాని, తొలియుచ్ఛ్వాసనిర్ణయ మొనరింపబడినను, ఆహారవిహారములు వ్యత్యస్తములైనవారి సంతతిలో స్వరనిర్ణయమే ప్రథానముగ ప్రథమమున కడుకష్టము.

ఒక్కొక్క నా భాగవిభాగములందు కొన్నికొన్ని విషయాదులే ముద్రితములై లోకమున కందజేయబడుచుండును.

ఇట్లు,

భక్తజన విధేయుఁడు

ముదునూరి చిట్టిబాబుపంతులు, హాజరు

రామచంద్రపురము.

తూ॥ గో॥ జిల్లా॥

ఓం శ్రీ కాళీమాత్రేనమః

## —: కృతి పద్యములు :—

సీ. అఖిలాండకోటి బ్రహ్మాండంబు సృష్టించు
బ్రహ్మలు వింజామరములు వీవ
సృష్టిపాలనము సమిష్టితో జేసెడి
విష్ణువు లాయుధ, ప్రీతిగఁబట్ట
లయమను సాయుజ్యలక్ష్యంబు తప్పని
నీలకంఠులు ఛత్రమాలలిడఁగ
కర్మజీవుల కిష్టకల్పనం బొనరించు
నింద్రులు పాదుక లెత్తిపట్ట
తే॥ మురిసిపోవుచు ముప్పదిమూడుకోట్ల
దేవతలు మ్రొక్కి కొలువులో సేవజూప
అంబ! శ్రీవిశ్వరూపంబు నందివేద
శాస్త్రసత్యార్థములను సాక్షాత్కరించె.

ఉ. కాటుక కన్నులన్ నొసటఁ గస్తురితో తిలకంబుదిద్ది ఆ
ర్భాటముగల్గి శక్తితతిరాజసమొప్ప నలంకరింప నీ
మేటికిరీటదీధితుల మేయపుఁజెన్నెల గాయుచుండ, మా
మ్మాటికి చిట్టిబాబుని సమాదరణంబుగ జూడు మంబికా!
దేవీ! నీ కరుణాకటాక్ష మలరన్ దేదీప్యమానంబు, నీ
భావాతీతల సత్ప్రభావ మహిమా, భాగ్యంబు సంధిల్లగా
శ్రీవైరాగ్యవిధానగణ్యుడ నశ్వశ్రేయస్సులం బొందెడిన్
జీవన్ముక్తుఁడు చిట్టిబాబనగ నాశీర్వాదముం జేయుమా!

తే॥ ధరపురాకృత పుణ్యవిధానగరిమ। అంగశాస్త్ర చతుర్థపరాయణమ్మ
శాలి నీకంకితంబిడి శాంతు పేరు। పొందు ముదునూరి వంశాబ్ధిచందురుండు.

కం॥ శ్రీరామకరుణ సీతా। రామసలక్ష్మణ సమాఖ్య రంజిల్లెడినీ
కామితమంగ చతుర్థము। భూమిజ సుస్థిరముగాత బుధసన్నుతమై.

ఓమ్

# విన్నపము

## అంగశాస్త్ర నిర్మాతయొక్క యుపనయన సమాచారము.



ఇతడు సామనుమడు.

వీని బ్రహ్మోపదేశమునకు వీరి జననియగు కీ॥ శే॥ మ॥ ల॥ శ్రీ ముదునూరు సీతారామలక్ష్మణమ్మ (వురఫ్) రామాయమ్మగారి ద్రవ్యము వెచ్చింపబడినది. కనిష్ట సంతానముపై దల్లికి ప్రేమాతిశయముగదా! అట్టిజనశ్రుతి వీరియెడ నిజరూపమును దాల్చినది. ఇట్టి మాతృధన సంక్రమణమును, విశ్వాసమును వెల్లివిరియుట కిటనుదహరించుచున్నాడను. వీరి అమ్మమ్మగారి మాతామహుని నివాసము శ్రీకాకుళంజిల్లా బొబ్బిలి కాపురస్తులు కీ॥ శే॥ మ॥ రా॥ శ్రీ అయ్యగారి పాపయ్యపంతులుగారు, వారు బొబ్బిలి సంస్థానమున పేష్కారుగా పనిచేసినారనియు వీరి మాతామహి జననియగు కీ॥ శే॥ పాలకోడేటి బుచ్చినర్సమ్మగారికి చాల ధన మిచ్చినట్లు వీరి మాతామహియగు కీ॥ శే॥ నండూరి అప్పలనర్సమ్మగారు కథగా చెప్పుటచే నేడావిషయములను జెప్పనవకాశమేర్పడెను. వీరి మాతామహి కొకసోదరుడుండెను. అతని పేరు కీ॥ శే॥ మ॥ రా॥ శ్రీ విశ్వనాథము పంతులుగారు. అపుత్రకుడై యౌవ్వనముననే గతించుటవలన, వీరి మాతామహికి జనకులగు, విజయనగరము సిటీ కానుకుర్తివారివీధి కాపురస్తులు కీ॥ శే॥ మ॥ రా॥ శ్రీ పాలకోడేటి ముత్తెన్నపంతులుగారి యాస్తిలో ¼భాగము, తల్లిగారియాస్తి వీరి మాతామహికి చెందగా వీరి మాతామహి జీవితకాలమందును ఆయమ మరణకాలమందును వీరి తల్లిగారికి విభాగముగ కొంతయాస్తి సంక్రమించినది. రి తల్లిగారు ఆమెకు తోచినంత స్థిరాస్తి వీరికిచ్చియుండిరి. అది వీరి తండ్రిగారు స్వర్గస్థులైన పిదప 12—12—45 తేదీని వీరి స్థూలశరీరసంబంధ

ధులైన వీరి అక్కగారు, బావగారు, వీరిసోదరుడు, నామేనల్లుడు అనగా వీరి నాలుగవ మేనమామగారగు కీ॥ శే॥ మ॥ రా॥ శ్రీ నందూరి సూర్య ప్రకాశరావు పంతులుగారు గృహపంచాయితీచేసి వీరు క్రమనొంద కుండ వీరి తల్లిగారిచ్చినదానిని సూక్ష్మీకరించిరి. ఆయ్యది మేరువనితలంచి నాడు. సూక్ష్మీకృతద్రవ్యమే వీరి యుపనయనమునకు వెచ్చింపబడినది, అట్టి స్థితిలో వీరి అక్కగారు మ॥ ల॥ శ్రీ మహాలక్ష్మమ్మగారు వీరిబావ గారు మ॥ రా॥ శ్రీ చన్నాప్రగడ కృష్ణంరాజు పంతులుగారును గాయత్రీ మంత్రోపదేష్టపీఠమున మాత్రముదిష్టించినందులకు వారిశ్రమకు బ్రతిగా ఆశీర్వచనముల నిడుచున్నాను. 1. వీరిజనని, 2. మాతామహియు. 3. నామెమాతామహుడు, 4. మాతామహి, పితృ, భాతృ. ద్రవ్యము, 5. వీరి మాతామహుడు కీ॥ శే। మ॥ రా। శ్రీ నందూరి వెంకట నరశింహులు పంతులుగారిద్వారా వీరి మాతామహికి సహజముగ పొందబడిన యలంకార స్త్రీధనమునుకూడ వీరి మాతామహి వృద్ధిపొందించినారు కాన వీరి యుపనయమునకైన ద్రవ్యము పైరీతుల మిశ్రమరూపములలో నణుమాత్రము. వీరి తల్లిగారివలన పంక్రమించినదికూడ నణుమాత్రమే యయ్యెను. వీరిజనని, వీనికై సంకల్పంచినద్రవ్యము వీరికిపూర్తిగాసంక్రమింప లేదు. స్వర్గీయవృద్ధుల ధనసహాయముననే యితడు బ్రాహ్మణుడగు మహా భాగ్యము కలిగినందులకు స్వర్గీయవృద్ధులగు స్త్రీ పురుషాదుల దివ్యనామ ముల సతతము స్మరించుచు కృతజ్ఞతాపూర్వక నమస్కృతు లర్పించు చుంటిని.

ఇట్లు, భక్తజన విధేయుఁడు
పులుగుర్త సత్యనారాయణమూర్తి వ్రాలు
తండ్రి కీ॥ శే॥ సుందయ్యపంతులుగారు
3–12–1957 చెల్లూరు
రామచంద్రపురము. తాలూకా. తూ. గో. జిల్లా.

ఓం.

## శ్రీ కాళీమాత్రేనమః.

# శ్రీ వీరభద్రీయాంగశాస్త్ర కృతిసమర్పణోత్సవము.

దాక్షారామ మాహాత్మ్యమును ప్రప్రథమమున నుదహరింప వలసి యున్నది. ఏలయనగా నీమహోత్సవము ద్రాక్షారామ దేవాలయమున శ్రీదాక్షాయణియగు శ్రీ మాణిక్యాంబవారి పవిత్రదివ్యసన్నిధిని జరుపబడినది. ఈ భీమఖండమను గ్రంధమును శ్రీ వేదవ్యాసమునీంద్రుడు రచించెను. శ్రీ భీమనాథుడు స్వయముగ నవతరించెను. శ్రీ సూర్యనారాయణ మూర్తివారిచే ప్రప్రథమమున పూజింపబడి ప్రతిష్ఠింపబడియె. కృతయుగమున గౌతమాదిఋషులు శ్రీ భీమేశ్వరు నభిషేకించుటకై సప్తగోదావరులను స్వామివారి పూజాసాన్నిధ్యమునకు గొనితెచ్చిరి. సప్తగోదావరి యనుతీర్థము శ్రీ భీమనాథుని పరమపావనస్వరూపము.

అష్టాదశపీఠంబులలో - దక్షారామమొకటియై దేదీప్యమానముగ వెలుగొందుచున్నది. 1957 సం॥రము జనవరి 13 తేదీ యందున భోగిపండుగుదినమున శ్రీ శ్రీ శ్రీ మాణిక్యాంబవారి సన్నిధిని శ్రీవీరభద్రీయాంగశాస్త్రమును శ్రీ శ్రీ శ్రీ కాళీమాతకు కృతినొసంగిరి. ప్రథమమున శ్రీ మాణిక్యాంబవారిపూజ, లలితా సహస్రనామములతో జరుపబడియె. వేదపఠనము ముగిసినతోడనే కార్యకలాపము క్రమముగ నడుపబడియె. పశ్చిమగోదావరిజిల్లా మాండలికోన్నత పాఠశాలలయందు ప్రధానోపాధ్యాయులుగ పనిచేసి, విశ్రాంతినొంది ప్రస్తుతము కొవ్వూరు సంస్కృత కళాశాలకు, ఈదరిమిలా నెలకొల్పిన సెకండరీవిద్యాలయమునకు ప్రధానోపాధ్యాయులుగనున్న మ. రా. శ్రీ ఆచంట రాధాకృష్ణమూర్తిపంతులు బి. ఏ. బి. ఇడి గారు అధ్యక్షస్థాన మలంకరించిరి వీరు సనాతన పరతత్వవేత్తలును, మిగుల కర్మిష్ఠులునై యున్నారు. గాన లోకకల్పిత చిద్రూపిణి, లోకమాత యగు శ్రీ శ్రీ శ్రీ మాణిక్యాంబవారి పవిత్రసన్ని

ధిని వ్వారే యధ్యక్షులుగనుండుట కర్తలని శ్రీచిట్టిబాబుపంతులుగారు నుడివిరి. శ్రీరాధాకృష్ణమూర్తి పంతులుగారిని తూర్పుగోదావరిజిల్లా మాం డలికోన్నతపాఠశాలా ప్రధానోపాధ్యాయులు శ్రీ పోకల సత్యనారా యణరావు బి. ఏ. బి. ఇడి గారు కర్పూరమాలాలంకృతులుగ జేసిరి. సభ కాహ్వానింపబడిన పభికులు, మహాదివ్యక్షేత్రమగుటవలన నిత్యయా త్రికజనము ఈమహోత్సవమును కండ్లార గాంచిరి. అధ్యక్షులవారు, చిట్టిబాబుపంతులుగారు, నూతన పరిశోధనలు గావించుచున్న ఈశాస్త్రవిభాగములు, లోకకల్యాణార్థమై లోకపరము గావించుచుండు తరి యనేక కృతి సమర్పణోత్సవములను జరిపించుచు, శ్రీశర్వాణి యను గ్రహఫలమును నిహపరములందు కలుగజేయుమని శ్రీమాతను సతతము వేడుచుంటిమనిరి. శ్రీ పోకల సత్యనారాయణరావు బి. ఎ. బి. ఇడి గారు ఇట్టిమహోత్సవములను జరుపుటయె క్రమవిధిగా శ్రీ చిట్టిబాబు పంతులు గారు జరిపించుచుందురని తేటపఱచి యిదియిట్లు మహోన్నతస్థలమున జరుగుట ముఖ్యమైన ప్రముఖ్యముగ భావింపక తీరదనిరి. ఆయుర్వేదభిషక్, కవిరాజా, శ్రీ వే॥ బ్ర॥ శ్రీ పెండ్యాల రామస్వామిశాస్త్రిగారు, చి॥దిన వహి వర్ణేశ్వరరావు పంతులుగారు గ్రంథమునందలి యావదభిప్రాయాదు లనుని వేదించిరి. ఈశాస్త్రప్రధమనిర్మాత కీ॥శే॥మ॥రా॥శ్రీ వీరభద్రరావు పంతులుగారిచేపరిశీలింపబడిన 'ఆయుర్దాయవిషయమనుగ్రంథస్తవిషయమును గూడ జదివిరి. కొవ్వూరు కాపురస్థులు మ॥రా॥శ్రీతల్లాప్రగడ గోపాలరావు పంతులుగారు శ్రీకాళిని శ్యామయనుటుచితమనిరి. మేలమను స్వర్ణప్రతి భాస్వరూపిణి. మనోమయకోశముగల పూర్ణులకు ఆమె సగుణరూపనిర్దిష్ట మున శుద్ధసాత్విక అసమాన చైతన్యోపాధియై జ్ఞాననిక్షేపమనిరి. శ్రీ చిట్టిబాబు పంతులుగారు బంధువులకు మిత్రులకు ఉద్యోగులకు కర్పూర హారములతో సత్కారమొనర్చిరి. కృష్ణామండలము బందరుపట్టణ కాపు రస్థులు కీ॥ శే॥ మ॥ రా॥ శ్రీ ముదునూరి వీరభద్రయ్యపంతులు న్యాయ వాదులుగారి మనుమడు శ్రీ చిట్టిబాబు పంతులుగారి సగృహనామమును మాత్రము కలిగిన చి॥ యీ వీరవెంకట సత్యనారాయణ వరప్రసాదరావు

పంతులు, కర్పూరచందనాదులతో తాంబూలములను సభికులకందరకు సమర్పించెను. శ్రీ చిట్టిబాబు పంతులుగారి స్థూలోపాధికి కారణమైన కీ॥ శే॥ మ॥ ల॥ స॥ ముదునూరు సీతారామలక్ష్మణమ్మ (వురఫ్) రామాయమ్మగారు శ్రీ వెంకటేశ్వర సాయుజ్యమును పొందిన భోగిపండుగ యనుదినము ద్వాదశతిథి గా నుండబడి కర్మజీవుల కర్మసంస్కార మట్టిదిన మున సపిండీకరణ విధానమున నడుపబడు కర్మవిధికి లోనైన జీవులకు ముక్తి చేకూరును. అట్టి భోగిపండుగు దినముననే ఇట్టిసన్నిధిని మహాపావన కార్యము జరుగుటవలన జననిగారికి దేహాంతే విదేహముక్తి స్థిరత్వశిద్ధి దాల్చి తృప్తిపడినట్లు శ్రీ చిట్టిబాబుపంతులుగారు నుడివిరి. కాన జనని గతించినదాది భోగిపండుగను పండుగుగా హృదయమున దలంచలేదని వచించిరి. తదుపరి స్మార్తాది పండితులు, అధ్యక్షులు, గ్రంథనిర్మాతను వేదోక్తాశీర్వచనములతో గౌరవించిరి. సభముగిసెను. వీరిధన మీవిధమున వెచ్చింపబడును.

(Sd)పోకల సత్యనారాయణరావు
రామచంద్రపురము. 3-12-57

—: కృ తు ల వి ష య ము :—

1. 1949 సంవత్సర ప్రారంభమున విజయనగర మహారాజావారి సంస్కృత కళాశాలయందు జరిగిన కృతిసమర్పణోత్సవమునందు శ్రీ చిట్టిబాబుపంతులుగారి యన్నగారి జ్యేష్ఠపుత్రుడు చి॥ ముదునూరు వెంకట సూర్య వీరభద్రేశ్వరరావు పంతులు బి. కామ్. ఆనాడు చిన్నవాడుగ నుండినను ఉపన్యాసకులలో గొందటిని మాలాలంకృతుల గావించెను.

2. అంగశాస్త్ర ప్రథమభాగ సమయమున శ్రీ చిట్టిబాబుగారి తృతీయ మాతుల జ్యేష్ఠపుత్రుడు శ్రీ నందూరి వెంకటకోటారావు పంతులుగారును, బంధువు మ॥ రా॥ శ్రీ దరణిప్రగడ శివరావుపంతులుగారు (రాజమహేంద్రవర కాపురస్థులు) దయచేసిరి.

3. అంగశాస్త్ర ద్వితీయభాగకృతి సమర్పణోత్సవ సమయమున చి॥ పోకలశ్రీనివాసరావు కర్పూరతాంబూలములను సమర్పించెను.

## అంగశాస్త్ర ప్రథమనిర్మాతలగు, కీ॥ శే॥ శ్రీముదునూరు వీరభద్రరావుపంతులుగారి

## జ న న కా ల ని ర్ణ రూ ప ణ సా ర వి ష య ము.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక 1304 కలి యుగాబ్దాః 4982కు సరియగు వృషనామసం॥ర మార్గశిర శు॥ 3 లు వృశ్చికమాసం 10 తేది 1881 సం॥రం, నవంబరు 24వ తేదీబుధవారం సూర్యోదయాది 59–22 లకు, మూల నక్షత్రాద్యంతం 56–14 ల పైకి 43–51 లు జరుగునప్పుడు 4వ పాదమున శూలనామయోగము, తైతులాకరణము, రవి భుక్తివృశ్చికమున 1–50 లు జరుగుచుండ లెక్కింప వృశ్చిక లగ్నాద్యంతం 5–38ల పైకి 3'–2''లు జరుగునప్పుడు వృశ్చిక లగ్నము, సూర్యహోర, మీనగురుడు ద్రేక్కాణము సింహ రవి, సప్తమాంశ. వృశ్చికకుజ నవాంశ. వృషభశుక్ర ద్వాదశాంశ. 17వ భాగ గురుత్రింశాంశ. శ్వానయోని పాదరజ్జు, ప్రథమపార్శ్వనాడి జననకాల కేతుదశా శేషం, స 1–6 మా 15 రోజులు.

— తాత్కాలిక గ్రహసంపత్తి —

అనూరాధ 2 వృశ్చికేరవిః 6–36
మూల 4 ధనుషిచంద్రః—10–22
పునర్వసు మిధునెవక్రికుజః—23–11
విశాఖ తులాయాంబుధః—20–7
కృత్తిక 1 మేషేవక్రిగురుః—27–44
స్వాతి 4 తులాయాం శుక్రః—18–13
భరణి 1 మేషేవక్రి శనిః—19–22

జ్యేష్ట 1 వృశ్చికే రాహు—18-52
రోహిణి వృషభే కేతు—18-52
లగ్నం వృశ్చికములో 16-32
*Part of fortune ధనస్సులో 20-18
మేషం గు—వ. 27-44 శ. వ 19-22
వృషభము, కే—18-52
మిధునము, కు—వ 23-16
తుల, బు—20-7 తుల, శు—18-13
వృశ్చికము, ల—16-32
వృశ్చికము, ర—6-36 రాహు—18-52
ధనస్సు, చం—10-22 *20-18

ప్రిస్తుత శ్రీకాకుళముజిల్లా, పాలకుండపురమున ముదునూరి వారివీధిలో 1881-11-24 తేదీని జననము.

| | | | |
|---|---|---|---|
| అగ్నిహోత్రిము | 3 | విజ్ఞానము | 4 |
| పృధ్వీలక్షణము | 1 | ఐహిక | 0 |
| వాయులక్షణము | 3 | సృష్టి | 5 |
| జలలక్షణము | 2 | శేవ | 0 |
| | 9 | | 9 |

| | | | |
|---|---|---|---|
| చతుష్పాద లక్షణం | 3 | మతము లేక భక్తి | 4 |
| మానవత్వం | 4 | స్థిరములు | 3 |
| పాకు జంతులక్షణము | 2 | సాధారణసంపత్తి | 2 |
| ఎగురుట | 0 | | 9 |
| | 9 | | |

నావిదేహముక్తికిగాను ఈక్రింది దానముల నొసరించితిని.
(మొత్తమున 25ఉదకుంభదానములు గావించుకొనడమైనది.)

| దానవివరము | గ్రామము | తాలూకా | మండలము. |
|---|---|---|---|
| 1. ప్రత్యక్షసవత్సగోదానము, సదక్షిణాకం | పరిమెల | తాడేపల్లిగూడెం | ప. గో. |
| 2. తాంబూలదానము, పళ్ళెరమున తమ్మలపుసామగ్రియు సదక్షిణయును | ,, | ,, | ,, |
| 3. పాదరక్షలు సదక్షిణముగ | ,, | ,, | ,, |
| 4. పరుపుసామానులు (దుప్పటి, శాలువ, దక్షిణ) | ,, | ,, | ,, |
| 5. ఉపనయన,వివాహయజ్ఞోపవీతములు క్షేత్రమునసదక్షిణ | చిలకలంపాడు అగ్రహారం | ,, | ,, |
| 6. ఉదకుంభదానములు, సదక్షిణలు | వల్లూరు | ,, | ,, |
| 7. ,, ,, | గణపవరము | ,, | ,, |
| 8. ప్రత్యక్షవృషోత్సర్జనము | ,, | ,, | ,, |
| 9. రజితదానము సదక్షిణముగ | ,, | ,, | ,, |
| 10. వస్త్రదానము ,, | ,, | ,, | ,, |
| 11. గుడదానము ,, | ,, | ,, | ,, |
| 12. ధాన్యదానము ,, | ,, | ,, | ,, |
| 13. చేతికర్ర ,, | పెంటపాడు | ,, | ,, |
| 14. సువర్ణదానము ,, | ,, | ,, | ,, |
| 15. పట్టెడ, మంచము చేతు కర్రది సదక్షిణ | వీరేశ్వరపుర అగ్రహారం | ,, | ,, |
| 16. బంగరు ఉంగరము ,, | నవాబుపాలెం | ,, | ,, |

| దానవివరము | గ్రామము | తాలూకా | మండలము |
|---|---|---|---|
| 17. కంచుమరచెంబు (లగ్నసమయమున) రాగిపళ్ళెము, కంచుఉద్ధరణ, సదక్షిణము;ఉపపాత్ర | నవాబుసాలెం | తాడే॥ గూడెం | ప.గో |
| 18. మహిషదానము సదక్షిణము ,, | ,, | ,, | ,, |
| 19. ఉదకకుంభదానములు ,, | పెదకాపవరము | భీమవరము | ,, |
| 20. ,, ,, | చినకాపవరము | ,, | ,, |
| 21. ,, ,, | మహాలక్ష్మీపురం, చినకాపవరనివారు | ,, | ,, |
| 22. సాలగ్రామదానము ,, | ,, | ,, | ,, |
| 23. పుస్తకదానము ,, | ఉండి | ,, | ,, |
| 24. లగ్నమునకు బియ్యము ధాన్యము వస్త్రసహితము, (కూరలు) | కరుగోరుమిల్లి | నరసాపురం | ,, |
| 25. లగ్నము, పీటలు, సదక్షిణ (చేరబడెపీటతోసహా) | గోనేడ | పెద్దాపురము | తూ॥గో॥ |
| 26. చందనము, సదక్షిణ | ,, | ,, | ,, |
| 27. తిలలు ,, | ,, | ,, | ,, |
| 28. ఉదకకుంభదానములు, సద ణ | ,, | ,, | ,, |
| 29. ప్రత్తి, దూదియు ,, | ,, | ,, | ,, |
| 30. ఆయుధము, పాశము ,, | ,, | ,, | ,, |
| 31. దీపముతో పెద్దయిత్తడిమరసెమ్మె (దీపసహితము) సదక్షిణ | ,, | ,, | ,, |
| 32. కాంస్యపాత్ర సదక్షిణము ఆవునెయ్యితో | ,, | ,, | ,, |

| దానవివరము | | గ్రామము | తాలూకా | మండలము |
|---|---|---|---|---|
| 33. లవణము | సదక్షిణ | పెద్దాపురము | పెద్దాపురం | తూ, గో |
| 34. ఉదకుంభము | ,, | చామర్లకోట | కాకినాడ | ,, |
| 35. జ్ఞాతాజ్ఞాత పాపశమనమునకై గోదానము, | సదక్షిణము | వెదురుపాక | రామచంద్రపురం | ,, |
| 36. గోదానము | | ,, | ,, | ,, |
| 37. భూదానము గోదావరి పుష్కరసమయము 1956సం॥రం | | రాజమహేంద్రవరము | రాజమహేంద్రవరము | ,, |
| | సదక్షిణ | | | |
| 38. గృహదానము | ,, | ,, | ,, | ,, |

39. 1956 సం॥రమున నాజననిగారగు మ॥ ల॥ స॥ శ్రీ ముదునూరు సీతారామ లక్ష్మణమ్మగారి యాబ్దికదినమున వారినిగూర్చి భూ; గృహదానములు రెండును దక్షిణయుతముగ గావించ నైనది.

ముదునూరి చిట్టిబాబుపంతులు

## నవరాత్రులవిషయము

పశ్చిమగోదావరిజిల్లాలో జరిగిపిననవరాత్రోత్సవములు (ఆశ్వయుజ శుద్ధములో, 49; 50 సం।రములో తాడేపల్లిగూడెం తాలూకా పరిమెళ్ల గ్రామమున; మ. రా. శ్రీ తల్లాప్రగడ శ్రీరామమూర్తి పంతులుగారి గృహమునందును; 52 సం॥రమున తణుకు తాలూకా సిద్ధాంతమను గ్రామమున (పశ్చిమగోదావరీతీరమునందలి పంచశ్రీ శివలింగక్షేత్రము) శ్రీ సోమయాజులుగారి సత్రమునందు జరిపినాను. 1951 సం.।రమున తూర్పుగోదావరి జిల్లా పెదాపురము తాలూకా గోనేడగ్రామమున దీక్షారూపమునమాత్రము జరిగించుకొనడమైనది.

# వి న తి

1926 సం॥రము భాద్రపదబహుళమున శీతజ్వరమంకు రించినది. కార్తికశుద్ధమున జ్వరోద్ధతి యధికమైనపుడు, నా తల్లిగారగు, మ॥ ల॥ కీ॥ శే॥ చిన్నమ్మన్నగారు (గృహావ్యవహారనామము) నాయన్నగారగు,మ॥ రా॥శ్రీ, వేంకటజోగారావుపంతులుగారితో జెప్పగా (నాతండ్రిగారుపాలకుండయందుండినకాలమున) నాంగ్లవైద్యులగు శ్రీ ముషునూరి వెంకటేశ్వరులు L.M.P. గారిచే, చికిత్సచేయించి, నాయసువుల నిలిపినవారుగాన, నాయన్నగారికి నిత్యనమస్కారముల నందజేయుచున్నాను. నాతండ్రిగారు, వారిజీవితమున నీశాస్త్రమును లోకవ్యక్తము చేయదలంచిరి. విధిబద్ధులగు జీవులు కర్మను దాటలేనివారగుటచే, వారియభీష్టమును, నాకుగల విజ్ఞానభాషాచైతన్యములతోడ నాజీవితములో, లోకవశము గావించి జనకాభిమతమును నెఱవేర్చుచుంటినని యానందించుచుంటిని. ఈముద్రణగ్రంథమును జిత్తులో నేనులిఖించియుంటిని. సాపుప్రతిని (Fair) విజయనగరంసిటీ సుబ్రహ్మణ్యంపేట కాపురస్థులు శ్రీ॥ వే॥ బ్రహ్మశ్రీ వడ్లమాని విశ్వనాధశాస్త్రిగారు వ్రాసిరి. ప్రూఫ్స్, మ॥ రా॥ శ్రీ ఆచంట రాధాకృష్ణమూర్తిపంతులు B.A.B Edగారు, చి॥ శ్రీ వాసా వెంకటరమణమూర్తిగారు, (శ్రీనివాసా ముద్రణాలయమున కధిపతి) దిద్దిరి. కాన, నాకన్న ప్రాయమునను పెద్దలగు

వారికి నమస్కారములను, చిన్నవానికి ఆశీర్వచనములను జేయుచుంటి. ఈశాస్త్రమునంతను శోధనాదృక్పదములో 90% (100కి 90 విభాగములు) గమనించుటకు పూజ్యక్షేత్ర మగు పశ్చిమగోదావరి మండలమందును, మఱి 5% తూర్పు గోదావరి మండలమందును ఫలితనిర్ణయముల ధృవపఱ్చు కొంటిని. అందు, ప॥గో॥ జిల్లా, పరిమెళ్ళగ్రామమున నా యనుభవములను ప్రథమముగా చిత్తుప్రతులుగా జాలమేర తయారుచేసికొంటిని. మిగిలిన స్వల్పానుభవములను, ప॥గో॥ (1) తాడేపల్లిగూడేం (2) తణుకు (3) భీమవరం తాలూకా యందలి 80% గ్రామవాసులు, కొవ్వూరు, ఏలూరు తాలూకాలయందలి 40% గ్రామీణులు, నాశోధనాకాలముల నాకు సర్వసదుపాయములు జేకూర్చిరి. ఇందు, తాడేపల్లి గూడేం తాలూకా, పైనుదహారింపబడిన పరిమెళ్ల గ్రామ వాస్తవ్యులు, మ॥రా॥శ్రీ తల్లాప్రగడ శ్రీరామమూర్తి పంతులుగారు, (వారిఅనుచరులు) నాయెడజూపిన, (1) గౌరవము (2) మర్యాద (3) భక్తి (4) శ్రద్ధ (5) ఆదరణలు, ఆధ్యాత్మికవర్తనలతో నిండినవైయున్నవి. నాపరిచర్యలు సక్రమతరగతిని జరిగించు శ్రద్ధ, భక్తి జూపిన శ్రీ కయ్యాల, పకీరోపాధ్యాయుడను నే మరువజాలను. ప్రప్రథమమున యన్యమండలముల నాశాస్త్రోద్యమమున, కుపక్రమించునెడ శ్రేయస్కరమని సదభిప్రాయమునిచ్చిన, నాజనకులకు స్నేహితుల ద్వితీయపుత్రులు. 1 మ॥రా॥ పోకల సత్యనారా

యణరావుగారు B.A.,B.Ed, నావిద్యార్థిదశలో చరిత్రలు బోధించిన కీ॥ శే॥ మ॥ రా॥ శ్రీ చోడవరపు నరసింహారావు పంతులుగారు, B.A.L.T. గారి ద్వితీయపుత్రులు, II కీ॥ శే॥ శ్రీయీరం రంగారావుపంతులు, B.A B,L గారు(కాకినాడ) కాకినాడ నివాసి III శ్రీ చింతలపూడి పద్మరాజుగార్లను మఱువజాలను. పశ్చిమగోదావరిజిల్లాలో నాప్రవేశకారకులు, మ॥ రా॥ వడ్లపట్ల రామలింగంపంతులుగారనే (ఏలూరు వాసి) మిత్రులు నా జ్ఞాపకార్థము వుదహరించుచుంటిని. నాతండ్రిగారి మిత్రులు విశాఖమండల విశ్రాంతితహశీలు దారు, కీ॥ శే॥ శ్రీ, పోకల వీరరాఘవులునాయుడుగారు వారి వార్ధక్యమున, నేనభివృద్ధిజెంది, శాంతిగా యుండవలెనని నాకృషులయందు తోడ్పడుచుండెడివారు. అట్టిరీతిగనె, నాతండ్రిగారిమిత్రులు కీ॥ శే॥ శ్రీ మునుకుట్ల నరసింహాము గారు (విశ్రాంతి ఇంపీరియల్ బ్యాంకు కేషియరు) నావృద్ధికై స్వయముగా కృషిసల్పెడివారు. విజయనగరముసిటీ, కస్బావార్డు వెలుటూరివారివీధి కాపురస్థుడు, నామిత్రుడు శ్రీ భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి M.A. యు, గుంటూరు కొత్తపేట కాపురస్థులు, మ॥ రా॥ శ్రీ కందుకూరి రాజారావు పంతులుగారు; B.Sc.L.L.B గారు వ్రాతప సహాకారులుగా నుండెడివారు. నాశోత్రియ, యుపక్రమణల యందున, నెల్లూరుజిల్లా, నెల్లూరు తాలూకా కోవూరు తాలూకాలలో పెక్కండ్రు నాపవిత్రచర్యలయందు మోద

మునుజూచిరి. తూ॥గో॥ జిల్లాయందు రామచంద్రపురము, రాజమహేంద్రవరము, కాకినాడ, పిఠాపురము తాలూకాల లోని కొన్నిగ్రామనివాసస్థులు, యిత్యాది యీమండలస్వల్ప వాసులు, నాగ్రంథరూపాంశములజూచి సంతసమొందుచూ, వారల యానందానుభవములను తెలుపుచుండిరి. పైరీతులనే పేర్కొనిన స్థూలోపాధులందలి జీవేశ్వర దివ్య తేజస్సును, నైన్నద్వైతమతమున పుట్టుటచే, విరాట్‌స్వరూపమని తన్మ యముజెంది నే తరించుచుంటిని.

"శ్రీ వీరభద్రరాయ" అంగశాస్త్రప్రతులు285అమ్మ బడినవి. 180 పుస్తకములు దానముక్రిందను, మిగిలినవి, పరిచయముగలవారలకు, స్వయముగా అర్థించినవారికి నొస గడమైనది. ప్రస్తుతము కాపీలు లెఖ్ఖవారిగా మాత్రముగలవు. ఈవత్సరము, శివారుగ్రామములతోసహా 35 గ్రామముల యందున ఈజిల్లాలో యీశాస్త్రముగూర్చి ప్రచారముచేసి యున్నాను. గతములో (1) నెల్లూరు, (2) ప॥గో॥ జిల్లా (3) తూ॥గో॥ జిల్లాలలోని గ్రామములు శివారుల గ్రామా దులతోసహా యనియన్వయించుకొనకోరినాను, నాశ్రోత్రియ పరిశ్రమలకు తోడ్పడినజనమును, విశ్వరూప, భావముననే నమ్మి నేనమస్కరించుచున్నాను.

ఇట్లు బుధజనవిధేయుడు,

ముదునూరి చిట్టిబాబు పంతులు

28—1—58 రామచంద్రపురం

# విషయసూచిక



## కొన్ని పదముల అర్థములు.

1. న్యాన = తక్కువ
2. ఖరుదు = సాగుచేయు  3. మిట్ట = ఎత్తుస్థలము
4. కాకవంధ్య — రెండు సంతానములు కలది.
5. కదళీవంధ్య 1 సంతానముకలది.
6. నీరదము = మేఘము = నీటి నిచ్చువాడు
7. సంజ = సంధ్య  8. చర్మభస్త్రిక — తోలుబొమ్మ
9. ధూసరవర్ణము బూడిదరంగు
10. కాకవర్ణము = కాకిరంగు
11. మరుభూమి చవుడుగల భూభాగ
12. క్రీతులు = కొన్నవారు  13. వదాన్యుడు దాత
14. ఏతాదృశపురుషుడు = ఇట్టిమానవుడు.

ఓ మ్

శుభమస్తు                                                                 అవిఘ్నమస్తు

శ్రీకాళీమాత్రేనమః.

# శ్రీసీతారామలక్ష్మణాంబికాంగశాస్త్రము

## ప్రథమ ప్రకరణము—భూస్థానము.

మానవునకు నేత్రద్వయమును, నందు తెల్లగ్రుడ్డును, నందు నల్లగ్రుడ్డును, దానిలోపాపయునుండును. (తారక) చర్మచక్షువులకుఆధ్యాత్మికదృష్టియున్నచోఁబరమాత్మస్వరూపము వారిగతజన్మకృతకృషి ననుసరించిసాధ్యము. ప్రత్యక్షప్రపంచమును వీక్షించువిధముననేపరమాత్మయొక్క సగుణరూపమునుగూడవశముచేసికొనుటకు నీవారశూకమువలెసూక్ష్మమైనకంటిపాపసహకరించుచున్నదని ప్రమాణవచనము. శ్రీసూరిదాసువంటి దృగ్విహీనులు జ్ఞానచక్షువుమూలముననేపరమాత్మనుదర్శింపఁగలిగిరి. ఇట్టినేత్రద్వయమును తను,కళత్రస్థానవర్తిత్తమై యున్నది.




ఇందు C D.లుమీదికనురెప్పయందుపరిభాగమై యున్నవి. A.B దిగువరెప్పలోని భాగమైయున్నవి.

క్రిందిరెప్పలోని భాగను కన్నుక్రిందికి బొటనవ్రేలితో విడచిన వరుణరేఖలు కాననగును. అవిధముగ పైరెప్పయందుగూడ రక్తరేఖలు కనఁబడును. కవికృతనేత్రవర్ణన మీశాస్త్రసమ్మ

తమే. ఆకృతులలోనికిమాత్రము లెక్కింపబడును. నిమ్న భాగగతరక్తరేఖలనుబట్టి తనుస్థానయనమున నెన్ని రేఖ లున్నవో గమనించి యన్నిస్థిరోపాధులను మానవుడు పొంది యున్నాడని, వివరింపవలెను. ఇట్టి రేఖలు స్ఫుట, రక్తయుత ములై నైశాల్యముకలవై (మిగులదళము అడ్డముగా A, B, C, Dల లోన వ్యాప్తములై) యుండవలెను. అట్లే నేత్రోపరి భాగమున విశాలరక్తరేఖలున్నచో చతురవస్థలయందును స్థిరాస్తులు వృద్ధినొందుచుండును. ఇట్టి తనుస్థానయనమున క్రింది, మీది, రెప్పలలో భాగరక్తమయమైనరేఖలు పట ములవలె నున్నచో నేటికాలువలు, తటాకములు, జలాధా రముగల పల్లపుభూముల నొందగలరు. ఇట్టిరక్తరేఖలధికయుత ములై పటములవలె తనుస్థాననిమ్నార్థ్వభాగల యందల్లుకొని యున్నచో మాతృగర్భముననుండు కాలమునుండియు స్థిరో పాధియుతులై వాసివృద్ధివలన జాతకులు సర్వభోగముల నను భవించెదరు. ఇట్లే కళత్రస్థాన నయనమున A, B C, Dల యందు పటాకృతులుగ రక్తరేఖలున్నచో పిత్రార్జితస్థిరోపాధి వృద్ధినొందుచు, తండ్రిచే మిగుల వృద్ధినొందింపఁబడి యా గర్భశ్రీమంతుఁడై జనసముమొదలు వానియింట సంపదలు వృద్ధియగుచునే యుండును. ఇట్టి వారిస్థితులు స్వయంకృషి క్రిందను (కమతములు) అమరకములక్రిందను వర్తింపబడ గలవు. (అమరకములు—కౌళ్లు, కదపాలు, ముచ్చలకాలు, ఘూఝమాసీల్క్రిందను వర్తింపబడగలవు) ఇట్టివారిగృహ మున

పాడిపంటలు కంబారులు నధికముగ నుందురు. పటాకృతులు లేకయుండి రక్తరేఖలడ్డముగ వ్యాప్తిని, దళాధికమునుచెందిన కొన్ని వేలరూపాయలు రాబడి కలవాడుగనుండును. తను కళత్రస్థానములందు దళముకలిగి రక్తయుక్తములగు నడ్డరేఖ లెన్నియుండునో యన్ని నిర్ణీతస్థిరవసతులంబొంది, వానివలన వత్సరమునకుఁగొన్ని వేల రూప్యముల నొందఁగలరు. తను స్థాననిమ్నభాగమున రక్తరేఖలు మితముగ నున్నచో సామాన్యస్థితివంతుడని గుర్తింపవలెను. ఉపరిభాగమున పటాకృతికలిగిన మధ్యవయసులో వేలకొలది యెకరములభూమికి నాధుడగును. ఎవనికి తనుకళత్రస్థానరేఖలు రక్తవర్ణములై దళాధిక్యము కలిగియుండునో యట్టివానికి ఏతచ్ఛాత్రసూచితములగు రాజయోగములు (మిగిలినవి) లేకున్న భూస్వాములకడ భూమిని కౌలుగాఁగొని, పట్టారూపమున హక్కు కలిగి సాగుచేయుచు సామంతుఁడగును. పటాకృతిగల రక్తరేఖల నొందినచో లక్షలకొలది వత్సరాదాయము కలవారుగ నుందురు. అట్టిరేఖ లెన్నియున్న నన్నిప్రదేశములయందు లేక గ్రామములయందు లేక జిల్లాలయందు వసతులు కలిగి యుందురని నిర్ణయించునది. రక్తరేఖలప్రవృత్తిలో అడ్డరేఖ, దళాధిక్యతకలిగి పూర్ణాకృతినొందినచో నదీజల మాధారముగాగల భూముల సాగుచేయువారగుదురు. నివృత్తిననుసరించి నదీజల, తటాకజలాదుల నిర్ణయించునది. అట్టిరేఖల ననుసరించి యట్టి తటాకగర్భముల వైశాల్యాదులుగూడ నిర్ణ

యింపవచ్చును. అట్టిరేఖలు ABCD వర్తనమై యధికదృఢ రక్తరేఖలున్నచో గుత్త,కదపా, శస్తురూపములలో ధనమును గాని, ఫలసాయములనుగాని పొందుచుండును. పటాకృతులు గజాంతైశ్వర్యవంతుల కుండును. ఇట్టివారొకతావుననే చాల వైశాల్యముగలభూవసతినిగలిగియుందురు. ఈకాండమునఎఱు పుజీరలుకంటిలోపలిభాగమున నడ్డముగను, దశాధిక్యముగను, సమవర్తనముగనున్నచో భూవృద్ధివిషయమున నధికత్వహేతు సూచకములని యెఱుంగునది. దశాధిక్యత యిందు ఎట్టి దూష్యము కానేరదు. ఇట్టితరగతులలో బిళ్ముక్తాకదపాల వలన విశేషముగ ధాన్యంవచ్చి ధనవంతుడగును. (అనగా దేశకాలాదులవలన నెట్టివైపరీత్యముకలిగినను, రైతు భూ స్వామికి ధాన్యమునిచ్చుపద్ధతి) తనుస్థానమున రేఖలు బల వంతములై, కళత్రస్థానమున A,B,C, D,లు బలహీనమైనచో, భూములు నదీజలాధారములైనను కడపటనుండుటయు, నదీ జలము నిర్ణీతకాలముననే లభించుటయు జరుగును, తనుకళత్ర స్థానములందు ఎఱుపుజీరలు ప్రవృత్తిమందమైనచో భూములు తటాకజలాధారములు, కూపజలాధారములు (ఘటీయంత్ర మూలమున) కలవై యుండును. తనుకళత్రస్థానము లిందిట్టి రేఖలు నీటిమెద్దడి నొందుభూములను సూచించును. గూడలు వేసి పంటపండించుటయు జరుగును. ఇట్టిభూములలో వరి యధికముగ ఫలింపదు. భూసారమును, జలాధారములనుబట్టి, తరతమ భావముగల భూస్వతశ్శిద్ధసారభిన్నస్థితులను ఫలము

లను గ్రహించవలెను ఇక్షేత్రయధమునుగూడ గ్రహించు నది. కళత్రస్థానము పటాక్రాంతమైయుండి, సుస్థానబలము హీన మైనవారు భార్యవలన నధికభూవసతిని పొందుదురు. ఈ స్త్రీ రాస్త్రివిషయమున అంగశాస్త్రప్రథమసాక్ష్యమునబట్టి యావజ్జీవసంపదలున్నవో, లేవో, గమనింపవలెను. ఉభయస్థాన రేఖలు నీలిరంగు లవర్ణములుగలరేఖలు చేరువనున్నచో నట్టి వానిభూవసతి చక్కగ ఫలింపకుండుట, మెట్టపంటలు పండుట, కుదువపెట్టబడియుండు యోగములున ఋణదాతలస్వాధీన మగును. రక్తవర్ణరేఖ లెన్నియున్న స్థిరాస్తులన్నియుండునని చెప్పవలెను, అనగా గృహారామని [illegible]స్థలాదులు. A,B,C,D లుగా దశమునకు వ్యాసమాకృతిగా తిర్యగ్వ్యాప్తినొందిన, రైతులనుండి నికిని వారు సంబంధము నొందువారై యుండును. సమదశరక్తవర్ణప్రవృత్తియున్నను తిర్యగ్వ్యాప్తి లోపింప నపుడు కూడ రెండువరిపంటలుపండు భూములకధికారి కాక తప్పదు. తనుస్థానసమునందు ఎఱుపుజీఱలయందు నీలిమ బూడిదవర్ణము కలిసి [illegible]లైనచో సెలయేటినీటిచే సాగు చేయబడు భూములనొందుటగాని, రైతుబలము తగనుండు భూవసతినిగాని పొందగలడు. ఇట్లు రెండుస్థానములందు వర్తించినచో ముఖ్యముగ [illegible] మునిసిపాలిటీమదుములనీరు ఆధారమైనదనుకూలముగ ఫలించుభూమిని పొందుటజరు గును. [illegible] సానముగ మిగిలినవర్ణములు వర్తించి నచో నట్టివారుస్థలముల్ తోటలు మొదలగు హామీలకు

లోనగుటగాని, క్రమనిర్ణయమైన పరాక్రమణలు చెందినవి గాని, జమీందారీగాని, లౌకికసంస్థలకు చెందినస్థిరాస్తులందు హక్కు–అనుభవములుకలవాడగును, లేదా ధర్మశాస్త్రాను సారముగ శుద్ధిలేనిస్థిరాస్తులను పొందగలుగును. పటాకృతు లందు రక్తయుతఊర్ధ్వరేఖలు వర్తించినట్టివి, అవయోగ ములుకావు. కాని దానిఫలమేమన ద్రవ్యము విలాసములకై వినియోగింపఁబడును. (1) పటాకృతి (2) అధికదళవర్త నము (3) సమదళవర్తనము అనుమూడువిధములందును ఆరామాదుల మూలమున విశేషఫలసాయమును నిర్వ చింపవలెను. అధికదళ, సమదళములున్నచో, వాని నిష్పత్తి ననుసరించి శాస్త్రజ్ఞుడు ఫలనిర్వచనమొనర్ప వలెను. ఇట్టివారి భూములకు ప్రతిసంవత్సరమును సార మొనర్పనవసరములేదు. సమవర్తనగలవారు విశాలభవన ములు, నాలుగిండ్లవాకిలి గలలోగిళ్ళు, పొందగలరు. ఇవి యెంతయు సుందరములైయుండును. అధికదళము కలవారు భవనముల నొందుదురు. పటాకృతికలవారు పరిఖావృత దుర్గముల పొందుదురు.

అట్టి తరగతిగల యెఱుపుజీఱలను రక్తరేఖలు తను కళత్రస్థానములయందు సన్నిహితాసన్నిహితదూరమున తిర్య గ్వ్యాప్తి నొందినచో నట్టినరుడు అనేకప్రదేశములలో భూ వసతుల నొందఁగలఁడు. ఇట్టిభూమియందు కొన్ని పట్టా నెంబర్లకును వివిధకాలవ్యత్యాసగణితపద్ధతులకు చెందియుండు

అనాల పంటలకు చెందుచు 1, 2, 3, తరమువారిగ, భూ విభజనకు చెందినదిగా నుండబడును. అట్టిరేఖలు దశాధిక్యము నొందియుండుటయే రాజయోగప్రదము. ఈసూత్రము భూస్థానము యుద్యములను ప్రకరణములఁ బ్రతిపాదించునది. ఇందు రక్తరేఖలు ఊర్ధ్వముగ కూడనుండును. నిలువుగగాని అడ్డముగగాని, నిమ్నముగగాని రక్తరేఖల వ్యాప్తత్వము వర్తించినచో స్థిరాస్తులను పొందునని తాత్పర్యము. అనగా 1. ఇండ్లు, 2. భూములు, 3. ఆరామములు, 4. దొడ్లు, 5. పాటినివేశనస్థలములు, 6. ఖనిప్రదేశములు అని యర్థము) అట్టి రక్తరేఖలు స్వచ్ఛందరక్తమయములైనచో రత్న, రజిత, స్వర్ణభూయిష్ఠములుగ నుండును. అట్టిమానవుని సాగుభూములకు సారముచేయునవసరములేకయే ఫలదములగును. కర్షకులాభూములఁ దమసాగులోనికిఁ దెచ్చుకొనుటకై ముందుగనే చెడ్డశిస్తు, నజరానాలు, చెల్లించుటయు జరుగనోపు. అట్టిరక్తరేఖలు వివిధవర్ణత్వమునొందిన, సామాన్యలోహభూయిష్టఖనిజసంపదకు చెందియుండును. భూసారముగూడ సామాన్యముగ నుండును. అట్టివానిభూములు సారము నపేక్షించునవై యుండును. అట్టివారి భూవసతి నుండి వచ్చునాదాయములోఁ గొంత గడపవలసివచ్చుట, హీనక్రియములకుఁ బోవుట మొ॥ వానిని సూచించును. తరతమభావము చెంది యుండనోపు. అట్టిరక్తరేఖలయొక్క విధము అధికత్వముచెందినచో, జాతకుడు దర్శనీయభవన

ములనొందకతప్పదు. స్ఫుటహీనమైనను, కోంగిగ దళహీనమైనను, జాతకుడు సామాన్య, స్వల్పాతిస్వల్పము, మితము నైన, గృహాము లనొందును. స్ఫుటక్షీణముకలిగిన జాతకుడు తనయిండ్లను బాగుచేసికొనలేడు. స్ఫుటము సామాన్యమైనచో వత్సరమున కొకపంటపండుభూమిని పొందకతప్పదు, నదీజల, తటాకజలాధారములులేక తప్పులల్యఆధారములు కలవిగా నుండునని గ్రహించనగును. స్ఫుటక్షీణము నొందినచో జాతకుడు ముగులగా లభించునిచ్చే. భూమిని పండించువాడగు. అట్టి నీలరేఖలు ... నచో ఆస్తులు, ఇనీరియాలు, ప్రధానజప్తులు ... వానికి లోనుగాకతప్పదు. రక్త రేఖలునిమ్నాగ్రభాగలయందు, భిన్నభిన్నాకృతులలో వర్తింపబడినచో, నిమ్నత్వననుసరించి జాతకుడు స్వల్పాధిక పరిమితములగు భూములను (నివిధపట్టానెంబర్లు, శరంవారీలను నొందకతప్పదు (వానికి ఇస్తునా, ప్రీతి, అనియర్థము. తనుస్థాననిమ్నభాగమున రేఖలు శూన్యమైనచో జననము మొదలు యుక్తవయస్కుడగువరకు నిర్ధనుడై యుండును. అట్టిస్థానము స్ఫుటవంతమైనజాతకుడాగన్న శ్రీమంతుడుగానుండును. (స్త్రీ, తనుస్థాన నిమ్నభాగమునందు స్ఫుటదళాధిక్యమున్నచో పుట్టింటివారియాస్తి వృద్ధినొందును. అయ్యాది పైరెండురీతులకు జెందనిచో, స్త్రీనిర్ధనగృహమున బుట్టి ధనహీనయై వివాహపర్యంతి నుండును. స్త్రీ తనుస్థాన పూర్వభాగమందు దళ, స్ఫుటాధిక్యతలు కలిగినచో బరిణ

యానంతరమున వివిధైశ్వర్యములఁ బొందును. స్త్రీ వితంతు వైనచో తనుస్థాన పూర్వభాగమున స్ఫుటదళములతోడి రక్త రేఖలు వర్తింపబడినచో స్త్రీయొక్క, తల్లిదండ్రులుగాని, సంరక్షకులుగాని, యందరు తాము నివసించు వాసగృహము గాని ధనవంతమై యుండకతప్పదు. అట్లే పురుషుని తనుస్థాన పూర్వనిమ్నభాగమునందలివర్తనంబునుగూడ గావింపనగును. పురుషుని తనుస్థానమంతయు అనగా నిమ్నోర్ధ్వభాగము లందు స్ఫుటము, దళము సూన్యమై, కళత్రస్థానమున పై రెండును స్ఫుటమునుఁ జెందినచో జాతకుడు కళత్రమువలన గాని, యితరస్త్రీలద్వారాగాని యాస్తినొందక తప్పదు. కళ త్రముయొక్క తనుస్థానోర్ధ్వభాగమున స్ఫుటదళములు కలిగిన రక్తరేఖలు వర్తింపఁబడిన, భర్తమొదలగు పురుషార్జితము, అట్టివర్తనగలస్త్రీ తనపేరున లిఖితరూప దత్తద్రవ్యమును స్వేచ్ఛానుభవము కలదైయుండును. పురుషునకు తనుస్థాన మున నూర్ధ్వనిమ్నభాగములయందు స్ఫుటదళములు రెండును వర్తింపబడినచో జాతకుడు 1. నిడుపు, 2. అడ్డుగ రక్తరేఖలు సమ్మేళనస్థితివలన యావజ్జీవము ధనస్థితోపాధుల నొందక తప్పదు; అట్లే స్త్రీ విషయమున గూడ పైన్యాయము వర్తిం చును. తనుస్థాన కళత్రస్థానములయందు (a) స్ఫుట, (b) దళ ములుకల మెఱుపుజీరలు వర్తింపబడినచో పిత్రియమైన స్థిరాస్తులతోడ మహావిభవోపేతుడై వర్ధిల్లగలడు. (గృహా రామ నివేశనస్థల, కేదారాదులని యర్థము.)

అట్టిరక్తవర్ణతిర్యగ్రేఖలయందు, రక్తవర్ణరేఖ లూర్ధ్వముగ వర్తింపబడినచో నపారముగ భూవసతి నొందగలడు. సక్రమవిలాసవినియోగమును నుండగలడు. అట్టిరేఖలస్ఫుటమును బట్టియు, దశాధికతను అనుసరించియు, వివాదరహితమైనదియు, విశేషఫలప్రదమైనదియు, ప్రథమగణనీయమగు భూవసతి యని నిర్వచింపవచ్చును. అట్టి యుపాధియందు ఆక్రమణలు లేక, యున్నతజలాశయములతోఁగూడి చూపరులకు మనోహరమగు వరిపంట గలవసతియై యొప్పును. అట్టి భూములయొక్క నీటివనరులు పెద్దవిగానుండును. సముద్రతుల్యములగు తటాకములు ఆభూములకు జీవనదాయకములు అని వివరింపనోపు. ఈరేఖలు నేత్రద్వయమునందును నిమ్నోర్ధ్వభాగములయందు పూర్ణవ్యాప్తత్వము నొందకయున్నను, కొలదిగ తగ్గియున్ననుగూడ తగురీతిని ఫలము తగ్గుచుండునని నిర్వచించునది. ఈరేఖలు శాస్త్రచోదితప్రవృత్తికలవైనచో కౌలుపరతు ననుసరించి రైతు, భూస్వామికంబారమును చెల్లించువాడుగ నుండును. ఇట్టిరేఖలయందు గొన్ని పూర్ణవ్యాప్తిత్వమును, మరికొన్ని యర్ధవ్యాప్తములునైనచో వాని పూర్ణతాల్పత్వముల ననుసరించి, స్వల్ప, అధిక, అత్యధిక, భూవసతులను పొందగలడనియు, తరతమభాగముగ న్యూనాధికఫలమును, స్వామ్యానుభవములఁ బొందుచు, గొన్ని వివాదరహితములు, ఆక్రమణాది వివాదరహితములుగ నుండగలవు. తనుస్థాన భూస్థానబలము వ్యాప్తత్వకాంతివంతములు

సవ్యాకృతులునై యుండి కళత్రస్థానమున, వ్యాప్తత్వకాంతి వంతములు న్యూనములై యున్నను నధికముగ స్థిరవసతియు, తదనుగుణముగ ధనాగమమును గలుగును. అట్టియాస్తి సన్నిహితవర్గములోని స్త్రీలపేరున క్రియపరచుట సంభవించును. ఇట్టిరేఖలు పూర్ణరక్తవర్ణములేకాని, వివిధవర్ణభూయిష్టములు కారాదు. ఇట్టిరేఖలను లెక్కించి వసతిసంఖ్యయు వివరింపనగును. ఇట్టితరగతులకు జెందిన వసతు లిట్టివని కొన్ని వివరింపఁబడుచున్నవి

ఇట్టిరేఖలు స్ఫుటత్వ వ్యాప్తత్వములలో న్యూనతనొందిన వారిగృహములుచ్ఛస్థితి నొందినవైనను వారిజీవితమున శిథిలత్వము నొందును. తను కళత్రస్థాన భూస్థాన సిమోన్నార్ధ్వ భాగలనంబడు A B అనుస్థానమున రక్తరేఖలు సవ్యాకృతి కలిగి తేజోవంతములై నధికముగ స్థిరోపాధులును, విశేష ఫలప్రాప్తియు కలుగుటలో నిస్సందేహము. రేఖావ్యాప్తి శూన్యమైన ఫలాగమమును తదనుగుణముగ నుండును. అట్టి భూస్వామిని రైతులు శిస్తునకు గడపవలయునని కోరుదురు. భూవసతికి జలాధారములగు తటాకాదుల గర్భములు మెరకలై సెలయేటి నీటిని భరింపలేకుండుటచే నీరుకట్టపైనుండి పొరలిపోవును. పంటకాలములో నీటిబెద్దడి కలుగును. అథవా జీవనదీజలాధారములైనను, కడపటనుండి సారహీనములై, జలలాభము నొందలేక ఫలశూన్యములుగ నుండును. నిర్జీవనదీజలాధారములైనచో కర్షకులు కాలపరిమితి ననుస

రించి జలమును విభాగించుకొనుటయు నగును. తిర్యగూర్ధ్వ రేఖలు, ఖండరేఖాఖండితములైనచో భూవసతులు విక్రయింపబడును. సవ్యాకృతి, స్ఫుటత్వములననుసరించి మసీషావంతుడు విక్రియాదుల నిర్ణయించునది. మఱియువిక్రియ కాలమును, క్రయదారులు చూపునాదరమును క్రియధనన్యూనాధిక్యములను నిర్ణయించునది. సవ్యాకృతి స్ఫుటత్వములు విషమవర్తనములై హ్రస్వత్వాదులతో నైల్యవర్ణయుక్తములైన నిస్సారభూములు అపసవ్యాకారసత్వమున సంక్రమించినవై యక్రమాక్రమణులకు లోనై ఫలప్రాప్తికాలమున శారీరిక, మానసికశ్రమకు దావలములు గాకతప్పదు. ఇట్టి భూవసతులను హీనవృత్తినొనర్చువారు క్రయపఱచుకొందురు. పై రెండింటి ప్రవృత్తులు హీనములైన భూములు జలప్లుతములో, అసమృద్ధజలములో యగునని సూచించునది. ఇట్టి రక్తరేఖలయందుగూడ మురగడనీరు ప్రవహించునవిగానుండును. ఈరీతిలో వివిధవర్ణములున్నచో నట్టియాస్తిపై ఋణదాతలు కపటవ్యవహారులై వివాదములఁ బెంచుదురనియు సూచించునది. కృత్రిమచర్యలవలన నట్టియాస్తిని ద్రోహులు ఋణదాతకు వశపరచుటయు కలుగనోపు. అట్టి సంపుటి ధూసరవర్ణ కాకరవర్ణ మిళితమైన నట్టిభూవసతి యభియోగములకులోనైన జప్తులు, వేలములు జరుపబడి తత్కాలమున నపేక్షకులులేకయే యాస్తులు ఋణదాతల వశముచేయబడును. అట్టివసతులపైనుండు ఋణములు చక్రవృద్ధు

లతో కూడియుండును. రక్తరేఖలు పూర్ణాకృతులైన నఖండ భూవసతియని నిర్ణయించునది. శేషించిననిమ్నోర్ధభాగవర్తన లందలి యూర్ధ్వనిమ్నభాగరేఖలు అల్పములా? అధికములా? వానిపరిమాణమును, దళమునందును, దళాధిక్యతయందును, గ్రహించి వసతిసామాన్యాధిక్యముల వివరించునది. దళహీన ములైనచో భూపరిమితి వైశాల్యము లోపించును. వ్యాప్త త్వానుసారము ఫలాగమాదుల వివరింపనగును వ్యాప్తత్వ మువలన క్షేత్రము దీర్ఘత్వమునొందును. రేఖ దీర్ఘాకృతిగాక ఖండఖండములుగ సమవర్తనమునొందినను, అట్టిరేఖాంతర్గత రేఖాకృతిని గమనించు నవకాశములేనిచో, భూవిక్రయ, క్రియముల నొనర్చువాడగుట తథ్యము. అట్టిరేఖలు తిర్య క్ప్రసారితములైనను, క్రమరేఖలయందొకటి చిన్నది, ఒకటి పెద్దదిగనున్న స్వల్పాధికపరిమితిగల భూములకు, నాథు డగును. తేజోవంతమునుబట్టి ఫలమును, క్రియధనవివరమును దెలుపునది. జలాధారాదులను గ్రహించునది. A, B వర్తన మును, తనుకళత్రస్థాన, నయనభాగలయందు స్ఫుటత్వము నొందినజననకాలముననే భూవసతివిషయమును, బాల్యము నాటివిషయమును తెలియనగు. ఉపరిభాగ C, D లవర్తనమున యౌవ్వనము మొదలు యావజ్జీవము పరిపరివిధ స్వార్జితాభి వృద్ధిని నిరూపించునది. నిమ్నోర్ధ్వభాగలయందలి A,B,C,D ల వర్తనము స్ఫుటముగ నున్న మానవు డాగర్భశ్రీమంతు డగుటయేగాక పలు స్వార్జితాభివృద్ధియునొందును.

చతుర్విధావస్థలయందు (అనగా) పటాకృతిలో C,D,A,B భాగములలో తనుకళత్రస్థానములు ఏభాగయందు కాంతివంతము క్షీణించినదో, ఏభాగమున రేఖలు మితముగ నున్నవో, ఏభాగమున రేఖలపరిమితములో, పటాకృతు లున్నవో ప్రథమదర్శనీయములు. తదుపరి, రేఖలయంత ర్భాగమున పూర్ణమధ్యమసామాన్యాదుల గమనించి ఫల వివరణమొనర్చునది. ఆరేఖలదళము, సమదళము సామాన్య దళమునను సరించిఫలము విపులీకరించునది. (1)అధికఫలితము: పటవర్తనకలవారు జమీందారులవలె నుందురు. సుందరమం దిరములు, సర్వసస్యసంపూర్ణభూస్వాములగుదురు. (2) అధిక దళముతో రేఖలుపూర్ణాకృతికలవియు, తేజోవంతములు,సవ్యా కృతులునైనచో॰ గొన్నివందలయెకరముల భూమికి స్వాము లగుదురు. అట్టివారిగృహములు సామాన్యములో నుత్తమ ములైయుండును. (3) కొన్నిరేఖలు అధికదళ, హీనదళ, పూర్ణదళ, మధ్యమసామాన్యాకృతులుగ, నున్నచో నట్టి రేఖాకృతి ననుసరించి ఫలప్రాప్తిని, భూశ్రయమునునుండి, సామాన్య, మధ్యమ, అధికవసతులని పరిగణించునది. రేఖ దళహీనమైన జలాధారశూన్యములుగ నుండును. సవ్యాకృతి నొందిన, సౌమ్య, సామాన్యవసతులుగను, కొంతకాలము మరుభూములుగను, కాలాంతరమున సంక్రమించి ఫలవంత ముగచేయబడును. చిన్నరేఖలు అధికారపత్రమూలమున నొందుట లేక యట్టిభూమికి తానొక భాగస్వామియగుట

తెలుపును. ఇందు CD,A,B లలో తనుకళత్రస్థానముల యందు ఏదోయొకస్థానమున పైపద్ధతులయందు పూర్తిగ బలములు (పగతులు) లేకున్నచో నిర్ధనుడగుట, లేక న్యాయ స్థానమున నధికారుల పర్యవేక్షణమున, నుంచబడుట, భూములు కుదువపెట్టబడుట, శాశ్వతకాలున క్రీయబడుట గాని జరుగును. లేదా బలవదాక్రమణలకు లోనగును. వివిధధూమ్యవర్ణములు ఫలవిషయమున భిన్నములు. ధూమ్య పరివర్తనలచే ఫలము తగ్గుటయేగాక శూన్యముకూడనగును. వివిధమాలిన్యధూమ్యవర్ణములు, బహువిధవివాదభూయిష్ట భూములని సూచించును. ఇంకను బహిరంగముగ కాలరూప ప్రభుత్వములచే విక్రయింపబడి కొంత క్రీతులకును గొంత ఋణదాతలకును హస్తగతమగును– రక్తరేఖలు శిథిలము లైన నా కాలమున స్థిరాస్తులు గోల్పోవుట; పూర్ణరేఖాకృతి వలన నష్టభూప్రాప్తినిగాని; తత్తుల్యాన్యభూవసతినిగాని పొందుట తథ్యము. ఏతాదృగవస్థయందు తను, కళత్ర, భర్తృ, భూస్థానబలములు శూన్యములై, తను, కళత్ర, భర్తృ స్థానోద్యమస్థానములు శూన్యములుగాగాని మిగుల బలహీన ములైనచో, కార్యస్థాననిర్మాణాకృతి బలహీనమై భ్రష్ట మైనచో నెంతస్థితివంతుడైనను, షష్ఠిపూర్తి యగుదాక నిర్ధనుడుగానుండును. వక్షభాగముననుండు భాగ్యరేఖలు ఖండితములగునేని, చరస్థిరరూపకోపాధులు నశించును. అట్టి భాగ్యరేఖలనుండిబుట్టి మాలాకృతులు మాలికాకృతి నొంద

నిచో తిరుగ స్థిరోపాధులనొందు, నవకాశముండదు. మాలా కృతులందు సిథిలములను బొందిన యాస్థియనుభవము, తనఖా మూలముగనో, సైనికశాసనానుసారముననో, ఏయితరకారణములవలననో హక్కుభుక్తములు కలవాడగును. అదృష్టరేఖలకు, మాలాకృతులకును ఖండనములున్న పూర్ణముగ నభివృద్ధిహీనుడై, నిరుత్సాహియై, కార్యవిజయములేక, జీవితమంతయు విచారగ్రస్తుడై గతాసువగును. అట్టివానివృత్తి, ఆధారరేఖలు సవ్యాకృతులైన సవ్యాదరము నంశయు, నేర్పడును. అపసవ్యాకృతులైన నండగనుండువారు చంచలస్వభావులుగ నుందురు. శిథిలములైన, నాశిథిలకాలమున యాతనాజీవిగనుండును. ఖండనములున్న నిరాధారుడగును. సంభావరేఖలచేరున్న, నష్టమైన యండలు పొందుటగాని, తత్తుల్యులవలన పోషింపబడుటగాని కలుగును. ఇట్టియాధారరేఖలస్థితి ననుసరించి వృత్తిరేఖల ఫలితమునూహింపనగును. మర్కటముఖము కలిగి, కార్యస్థానము సామాన్యదీర్ఘమునొంది తుదిభాగవలముగనుండక, కుడివైపువాలు కలిగిన యావజ్జీవభాగ్యజాతకుని దత్తపుత్రుడగుటయు, నతడు డెబ్బదియేండ్లవఱకు జీవించుటయునగును. ఇట్టివర్తనగల స్త్రీకిమాత్రము పైవిధముగ నారోపించవలెను, అట్టిస్త్రీ గుజ్జురూపముకలిగి, సన్నిహితజ్ఞాతివర్గమునుండి యొకనిని, దత్తతనొంది సనాతనపద్ధతిగ, వేదోక్తరీతిని, హోమపూర్వకస్వీకారము జరుగును. అట్టిదత్తపుత్రుడు

మాతులకన్యాపరిణయమొనరించును. అట్టివాని ద్వితీయపుత్త్రుడొకడే కర్మాధికారిగ పరిగణింపఁబడును. యావజ్జీవభాగ్యవర్తనగలస్త్రీ చతుర్థభాగభూస్థానబలములు, స్ఫుటమునందు దశమునందు, అధికత్వము నొందినచో భర్తకు అనేకవిధముల సంపదభివృద్ధి కారకురాలగును. స్త్రీ పురుషులయొక్క తనుస్థాననిమ్నభాగ మొకటియే తేజోవంతమై దశసహితమైనచో నట్టినరులు బాల్యమున స్థిరోపాధినొంది యౌవ్వనమధ్యభాగమువఱకు చరవిక్రియధనముతో శ్రమనొందక తప్పదు. బాల్యకాలపువసతులు, దానవిక్రియాదులతో లిఖితరూపమున నశించుననుట, రేఖావ్యాప్తి పూర్ణాకృతినొందిగ పూర్ణమైన వసతుల దప్పక పొందును. రేఖాకృతియొక్క న్యూనతననుసరించి వసతి విస్తీర్ణముగూడ లోపించుచుండును రేఖసన్నగిలిన కొలదియు మొత్తపుఆస్తి పట్టానెంబర్లుగలిగి యుండునని గ్రహించునది. కళత్రస్థానములేక భర్తృస్థానోర్థభాగము తేజోవంతమైన చరమదశయందు స్థిరోపాధుల నొందును.

---

## ద్వితీయ ప్రకరణము—ఆధారరేఖాప్రకరణప్రారంభః

వృత్తి రేఖలు:—కంటియొక్క క్రిందిరెప్ప యందడ్డముగా నుండును. అవి యింద్రధనురాకారముకలిగి యుండును. సరళరేఖాకృతిలో నరుదుగాకూడానుు ఇవి (1) వృత్తి

(యుద్యోగము, వ్యవసాయము) (2) సోదరీసోదరభావము. (3) స్థిరాస్థివివరము. (4) ఉద్యమావరోధహేతువులును వివరింపఁబడినవి. అట్టి (1) (3) (4) అట్టిసంగతులకు ఆధార విషయముల, నీప్రకరణము నిర్ణయించును.

ఆధారరేఖలు కంటిపైరెప్పయొక్క యుపరిభాగమున నిర్మింపబడియుండును. అవియును పైనుదహరింపఁబడినవృత్తి రేఖలవలననే యాకృతులఁదెలుపుచు నాధారతరగతుల వివక్షను దెలుపుచుండును. మానవుని రెండు కండ్లకును రెండుపైరెప్పలుండునుగదా! అర్థనారీశ్వర న్యాయము ననుసరించి తను, కళత్ర, పితృస్థాన, జీవనాధార వృద్ధివిభాగయుక్తవిచారణము నుద్ఘాటించును. ఈరేఖలు పైనుదహరించిన నిర్మాణాకృతులందు సవ్యాకృతి నుండవలెను. అపసవ్యముగ నుండరాదు. శిథిలములను, ఖండనలను గానిచెందరాదు. అధవా, శిథిలరేఖలు వర్తించిన యుగ్మరేఖలను సంధానరేఖలయొక్క సంయోగముండవలెను. రేఖాగతులు సవ్యసరళాకృతులై సరళరేఖగాఁ గొంతమేరనైన వర్తింపవలయును. వక్రగతి యుండరాదు. స్ఫుటముగ నుండవలెను.



ఇట్లు కంటి పైరెప్పలందు గల యాధారరేఖలను అన్వయించుకొనునది. A - B లు శిరోభాగమున నుండునవియే యాధారరేఖలు




ఆధారరేఖయందు F-Fలకు నడుమ శిథిలత్వమును జెందుచుండ ఆయాను జంటరే. యనుసంధానరేఖ సంయోగమును కూర్చుచున్నది.




E-F అను నాధార రేఖయందు G-H యనుస్థలమునందు రెండు ఖండన రేఖలు ఖండించుచున్నవి. పైరీతిగ సమన్వయించినచో దిగువ రేఖాగతులు, కాంతివంతము ననుసరించి ఫలితములు తేటబడును.

వృత్తరేఖలయందుగాని ఆధారరేఖలయందుగాని సరళరేఖవర్తన నడుభాగయందుమాత్రము గుర్తింపగలము. తుది భాగలు వంపులేక వాలుకలిగి యుండును. కొన్నిటియందు ఆధారరేఖలు పూర్ణాకృతుల నొందవు. ప్రారంభనడుమ, తుది భాగలయందు రేఖలకు స్ఫుటహీనత కారాదు. అట్లున్నచో నవయోగసూచకము ఆధారరేఖలు సత్యాకృతి నింపిధను రాకృతి గలవైనచో యావజ్జీవము సక్రియాధారమగును కొందరుమానవులలో నాధారరేఖలు, సరళరేఖాకృతి నించు మించులో నొందియుండును. శిథిలములు మనయాధారరేఖ యందు ఎచ్చటనైన తుంపులున్నచో నేకార్యమునందైన సహకారము శూన్యమగును. వర్తమానకార్యములు శూన్యావస్థనొందుతటి, యుగ్మరే యను సంధానరేఖా సన్నికర్షమున తలచూపి మరల పూర్వకార్యనిర్వహణము జరుగును. శిథిల

సమయమున నెంతగా యత్నించినను సహకారమొనర్ప నం
గీకరింపరు. సహకారమునకు సవ్యహేతువులును గనుపింపవు.
అత్తరి ప్రతివారును యథోచితావస్థనొందెదరు. శిథిలకాలప్రా
రంభమున నేవో సాకులుచూపి యుద్యమాదులందవరోధము
లేర్పడి చేయుయత్న మొక్కసారిగ నాపివేయబడును. అట్టి
స్థితిలో సహకారులు చంచలస్వభావు లగుదురు. సహకార
మొనర్ప నూహించినవారును, తత్కాలమున నేవియో కారణ
ముల విభిన్నమనస్కులగుదురు ఇట్లే సహాయమన్వేషించిన,
చపలమనస్కులై యథోచితాభిప్రాయములుకలిగి యెటు
పోయిన నేమగునోయని తలంచెదరు. శిథిలరేఖాకాలము
భుక్తమైనతోడనే జంటరేఖయనఁబడు సంధానరేఖాప్రారంభ
మున నవ్యవధిగ సర్వజనులును నెట్టియాలోచనలును లేకయే
సహకరించి జయప్రదముగ కార్యమును నిర్వహింతురు.
వలయు వస్తుపరికరములు కొఱతలేక, లభ్యమగును. ఖండన
రేఖచే నాధారరేఖలు ఖండింపబడినచో నడుచుచున్న
యాధారములు ఆకస్మికముగ నన్నియు నాగిపోవును. అట్టి
ఖండనాకాలమున నాధారములన్నియుఁ బూర్తిగ నశించును.
ఎచ్చోటను నెవరివలనను నాధారమార్గములు ప్రదర్శింపఁ
బడవు. ఖండనరేఖా పరిమితికాలమంతయు నరకతుల్యమై
యుండును. అపుడు బంధువర్గము, హితజనము, పరిచితులును
తాటస్థ్య మవలంబింతురు. చూడనైనఁ జూడరు సరికదా
బహువిధముల దూషించుచు, దయాహీనులై హింసింప నుం

కింతురు. ఖండనాకాలమున సంభవించు పరిస్థితులఁ గొన్నింటి నిచట నుదహరించెద. ఉద్యోగసమయమునఁగల లోపాదులు సక్రమముగ నిర్వహింపలేకుండుట. కర్షకులైనచో నొకరి భూమిని నితరుఁడాక్రమించు కొనెననియు, పితూరీలవలన స్వస్థల పరిత్యాగ మొనర్చెననియు, బేహారులైనఁ దమవర్త కపుటోడలు గంగపాలగుటయు, ఇవియేగాక తొలగింపులు, వివాదములు, ఆపత్కాలమున ఆస్తినంతను విడిచి యజ్ఞాత ప్రదేశమున, లేక విదేశమున నఱుపేదస్థితి నొందుటయు జరుగును. అట్టి ఖండన వర్తించుకాలమున, మానవుడు నిస్సహాయుడై దైన్యముచే జీర్ణించి కృశించిపోవును. అపు డనామకుడై యుండును. శిథిలకాలమునఁగూడ వ్యర్థునివలెనుండును. శిథిలరేఖకు సంధానరేఖా సాన్నిధ్యముకలిగిన, పూర్వపుస్థితినిగాని, దానికధికస్థితినిగాని మానవుని గొనిపోవును. ఆధిక్యత మెట్టిదన రేఖసమదళమునొందవలెను (సమదళము= లావు, వలము, బట్టి) ఈప్రకరణమున దళాధిక్యతగూడప్రశస్తస్థితినిగోచరించును. అత్యధికముతగదు. రేఖసమదళమునున్న శిథిలమైనదానినే పొందగలడు. దళమధికమైన గతపరిస్థితికన్న నాధిక్యమునొందును. దళహీనమైన, వృత్తియుద్యోగాదులలో శిథిలత్వమునొందిన ప్రథమస్థితికన్న తరగతిలో క్రిందిపరిస్థితికి చెందినవిషయానురూపుడగును. ఖండనవిషయమున తత్పూర్వాపరకాలస్థితి కనురూపాధారముల నొందుటగాని, నూతన మార్గమున కృషులయందాధారము నొందువాడగును.

ఇదియు, సమదళ, అధికదళ, హీనదళ రేఖల ననుసరించియే యిదివరలో ననుభవముననున్న దానినిగాని, తుల్యమును గాని, అధికపద్ధతినిగాని, హీనపద్ధతినిగాని గత విధానమువందైననేమి, నూత్నవిషయమునందైననేమి పొందకతప్పదు, అనగా నూతనద్వారములుకలుగుట, ఖండన, శిథిలకాలానంతరముల గమనించనగు, పలుశిథిలము లాధార రేఖయందున్నచోఁ బెక్కుమాఱుల దేయుద్యమమునందుతన స్థానమును గోల్పోవుచు,సంధాన రేఖాకాలమందుమఱలమఱల నొందుచునుండును. ఖండనలాధార రేఖలయందు పలుస్థానములయందున్నతరి, యుద్యమాదులకు లోనై యొకటినశించినతోడనే నిస్సారుడై, తిరుగ వేఱొకటిచొప్పున, సహకారములనొందుచు జీవితమునవిసుగుతో వేసారి, నడుపుకొనుచుండును. ఒకని యాధార రేఖలయందు పెక్కుశిథిలరేఖలు, ఖండనరేఖలు వర్తించిన మానసిక, శారీరకశ్రమల నేకముల నొందువాడగును. వ్యర్థజీవియునగు, శిథిలరేఖాదోషముకన్న ఖండనరేఖాదోషమే యధికమని యెఱుంగునది. ఆధార రేఖలందున్న శిథిలరేఖాకాలమున, సంధానరేఖలు వక్రగతి నొందినచో విసుగు, నిర్లక్ష్యభావముగలవ్యక్తి, తనకుసముచేవిషయమున కాదని గుర్తించి, తప్పనిసరియనియెంచి, యెట్టకేలకు, సఫలపరిస్థితియందు వానికి, సహకారముచూపి, వాని నుద్ధరింపఁగలఁడు. సవ్యాకృతిగల సంధానరేఖ వర్తించిన, సవ్యమైనయభిమాని. శిథిలరేఖలవలన చిక్కులుపడుచున్న వానికి, విముక్తివిషయమున, సర్వదా, సహకారము, చూపు

గలడు. ఆధారరేఖలు స్ఫుటముగనున్నచో నాధారము లవలీలగ నందుబాటులో నుండును. కీర్తనీయులు, నామ వ్యాప్తపరులు, పలుకుబడి, హోదా, ఉన్నతి, ప్రతిభ, సద్బుద్ధిగలవారు సహాయులగుదురు. ఆధారరేఖ తుంపులుగ నున్న, శిథిలస్థితియని గ్రహించవగును. అట్టిస్థితిని శిథిలరేఖ యని వ్యవహరించుచున్నవాడు. ఆధారరేఖ తుంపునొంది, వేఱొకసంధానరేఖచేఁ గలుపబడి, యది తేజోవంతమై యున్నచో గొప్పవారిసహాయము నొందగలడు. గొప్పయన (1) ఉద్యోగము, (2) ఉద్యమములు, (3) వ్యాపారము, (4) వ్యవసాయము, విద్య, నాయకత్వాదు లందాన్నత్యము కలవారు. ఇట్టిస్థితిలో నాధారరేఖయందలి శిథిలమును కలుపు సంధానరేఖ సవ్యాకృతినొంది, తేజోవంతమైన స్థితిలో మాత్రము నిర్ణయింపనగును. అట్టిసంధానరేఖ యపసవ్యా కృతినొందిన పలుకుబడి కీర్తికల సమర్థులు సహాకారమును చూపుదురు. (సర్వసమర్థులు = సామాన్యచతుర్విధోపాయ ములచే నెట్టికార్యమునైన సాధించువారు) అట్టిసంధానరేఖ సవ్యాకృతితో వర్తింపబడినమేటి నేర్పరితనము, సరళసమ యోచితముగను కార్యము సాధించువారుగనుందురు. ఆధార సంధానరేఖలు రెండును, తేజోవంతములైనచో "ఏనుగున, కేనుగే గతి" యనునట్లు హైన్యమునొందిన మహనీయునకు సాయమొనర్పగల మహనీయుడుగ నుండగలడు. ఆధారరేఖ తేజోహీనమైనదశలో సామాన్య

నిగ వ్యత్యాసపరచుట సంభవము. ఆధారరేఖ తేజోవంతమై శిథిలస్థితిలో కాంతిహీనము నొందినతటి యొకపెద్దవ్యక్తి లేని పోని పరిస్థితులపాలయ్యెనని యర్థము. శిథిలమునకు కొలది జాగు ముందుగగల యాధారరేఖ తేజోహీనము నొందు స్థితిలో మానవుడు క్రమక్రమముగ నీచాదిసంఘటనలకు లోనగుచున్నాడని యర్థము. ఆధారరేఖ పూర్ణస్ఫుటమున జెంది, శిథిలస్థితిలోమాత్రము తేజోహీనమునొందిన మానవు డుచ్చస్థితినుండి హఠాత్తుగ పరిస్థితులు తారుమారై పతనము నొందును. శిథిలత్వము, విముఖత్వాది తాత్కాలిక విషమస్థితి సూచకమని యెరుంగునది. సంధానరేఖ తేజోవంతమైన దయాదాక్షిణ్యాదులుగల యుత్తముల సహకారము నంద గలుగు. శిథిలస్థితిగలరేఖ (ఆధారరేఖ తుదను) తేజోవంతమైన స్వల్పహేతుకములగు విముఖత్వములు, విపులపరిస్థితులు నేర్పడనగు, అట్టి వివచనీయావరోధ కారణములుగనిలువవు ఆధారరేఖస్ఫుటమైనపవిత్రక్రియలనాచరించు పూజ్యుడనియర్థ ము. తుదనుమాత్రము శిథిలమునొందినకాంతిహీనమైనతాను విధిలేక తెలిసియు తెలియకనాచరించు, నపవిత్రకార్యమనియ ర్థము. లేక మంచివాడైనను ఇతరత్ర వాటిల్లిన పరిస్థితులవల నను, ఇతరులమాటలఁబురస్కరించుకొనియాచరించు నకార్య ముగ పరిగణింపఁబడును. మొత్తముపై నేదోయొక తప్పుఁ జేసి తాత్కాలిక దుస్థితి నొందువాడగును. ఆధారరేఖలు తేజోవంతమును జెందిన పెక్కుఆధారములు వలసిననిన్ని

యుండగలవు. ఆధారరేఖ తేజోవంతమువలన మిన్నయై తన ద్బుచు, మధురమితభాషణము, సుఖకరసహకారముల నొం దును. వృత్తులయందధిక లాభమును గోచరింపజేయును. శిథిలరేఖ తేజోవంతమైన నిష్కారుకకల్పితకారణములచేవిషమ స్థితి యేర్పడినను లోకులు పరితపించుట, సానుభూతిజూపు టయు నట్టివానికి లభింపగలదు. ప్రీతియు ప్రజాకర్షణము౯ బాతుకుడగును. ప్రజలను తనచాతుర్యపూర్ణ్యమున రంజింపజేయు వాడగును. ఆధారరేఖ యారంభమునుండి తుదివఱకును కాంతివంతముగనుండవలెను. కంటిపై రెప్పయందు పెక్కు ఆధార రేఖలుండును. అవి యెన్నియుండునో యన్ని పరిమితాధార ముల నొందగలడు. ఆధారరేఖయందలి తేజోవంతమును, శిథిలములను, సంధానములను గమనించి, వానిస్థానముల౯ బ్రీతిరేఖయందును గుర్తించి పిమ్మట కాలనిర్ణయ మొనర్ప వలెను.

తనుస్థానమున నెన్ని రేఖలుండునో యన్ని విధములగు నాధారములచే మార్పునొందును. తనుస్థానమున నాధార రేఖలుండుటయేగాక యూవజ్జీవభాగ్యములుకూడ వర్తింప బడుటవలన, అట్టివ్యక్తియొక్క స్వార్జితమధికమగుటయు, స్వబంధుజన సహకారముల నందుట, అభినందింపబడుటయు బడయగలడు. రేఖల తేజోహీనకాలమున, హీనరూపపరిస్థి తులు యథోచితస్థితి నొందగలవు. తనుస్థానగతాధార రేఖ లన్నియు కాంతిహీనములైనచో నాధారములను స్వతసిసిద్ధ

ముగగాని, యాత్రీయులవలనగాని పోందలేడు. ఆధారముల నందుటలో, నసమర్థుడగును. అట్టివాడు సహాకారమపేక్షించి పరులకడకేగి వారికి సేవయొనర్చువాడగును. తనుస్థానగత ఆదారరేఖలు తేజోహీనములైన తన సంపాదనారూపమున సహాకారముల నందలేడు. ఇట్టితరి కళత్రస్థానీయాదారరేఖలు తేజోవంతములైనచో, కళత్రసంబంధులవలన సహాకారము నొందకతప్పదు. అనగా స్త్రీజన సహాయము నొంది, వారి యధిక్షేపములు, వారి చంచలస్వాభావములకు లోనగుటయు జరుగక తప్పదు. అట్టివారికి స్త్రీ యాజమాన్యమున వర్తింపక తప్పదు. మరికొన్నితావుల స్త్రీధనముననే జీవయాత్ర, వృత్తులు, ఉద్యోగములు సంభవించును. అట్టివారికి తేజోబలమున్న స్త్రీలభివృద్ధికారకులగుదురు. తనుస్థానాధారరేఖలు కాంతిహీనములుగనుండుటవలన జనకుని వలనగాని సోదరునివలనగాని తత్తుల్యసంబంధులవలనగాని యెట్టిసహాకారముల, నిసుమంతయు పొందనవకాశముండదు. కుమారులు, మనుమలు మొదలగువారివలనకూడ, సహాకారము శూన్యముగనుండును.

తనుస్థానగత ఆధారరేఖలయొక్క స్ఫుటముక్షీణించి, చతుర్విధోద్యమస్థానములందు బ్రహ్మ, విష్ణ్వాద్యమస్థానముల తేజోవంతము హీనమైనచో, రుద్రశక్త్యుద్యమములు అధిక తేజముకలవైన స్వతస్సిద్ధవివేకములేక, స్వయముగ జీవయాత్ర క్రమింపనేరక, విద్యావిషయమున సామాన్యుడై మందబుద్ధియై, తనుస్థానోద్యమస్థానములను పైస్థానములుచెడుట

(స్ఫుటాదిహీనములగుట)వలనముంగోపము,మూర్ఖత్వము,పూర్ణనమ్మకము, స్వీయభావములఁ బూర్తిగ తెలుపుటలు సహజములై, యుండును. అసమర్థతచే కన్నీరుకార్చుట, అమాయకానందమునొందు స్వభావియైయుండును. బుద్ధిహీనతవలన స్వతంత్రభావము, స్వయంకృషి లేకయుండును. తాత్కాలిక భా వి యో చ నా శూ న్యు డు ను న గు. ఇట్టివాడు, పరులకు, కళత్రము, ఆమెబంధువర్గము, వారిపెట్టుబోతలకు లోనై వారియాదేశానుసారము వర్తించుచు, భీరుదృష్టితో నిట్టూర్పుచు, కళాహీనుడై యనుక్షణము కంపమునొందుచు, నున్మాదరోగివలెనుండును. అల్పతుష్టితోఁపై బంధువర్గమువలన స్వకార్యముల జరుపుకొనుచుంటిననియానందించును. అట్టి బంధువులకు ప్రయోజనహీనముగ సేవచేయును. స్వీయకార్యనిర్వాహణభారము పరులయందుంచును, ఇట్టివాని కార్యస్థానాకృతి, దీర్ఘసౌష్టవము, వర్ణసౌమ్యస్థితి, లేకుండుటచేఁ గార్యనిర్వాహణశక్తి లేశమునులేకయుండును. ఆధారరేఖ౧ కాలనిర్ణయము, వృత్తిరేఖాకాలనిర్ణయము, సమత్వము నెఱుంగునది. చతుర్వేదావస్థ (మాన్యులకు పైనిర్ణితరేఖల విభజించి, కాలపరిమితుల నిర్ణయింపనగు. తనుస్థానాధార రేఖలు, తనుస్థానోద్యమస్థానము (1,2) కాంతిహీనమైన స్త్రీధనముపై నాధారపడుటయు (స్త్రీధనములు మనోవృత్త్యాదులు) వారినాశ్రయించియునుండగలడు. (స్త్రీవిత్తమధమాధమం) కళత్రస్థానోద్యమస్థానములగు 3,4. లకు స్ఫుటాదు

లుండుటచే భార్య, ఆమెబంధువులు బుద్ధిగలిగి సర్వవిషయములందును న్యూనాధికవిజ్ఞానము నొందగలరు. కార్యసాధనము, లాభము, వారిబుద్ధిబలముచే నొందగలరు. విపరీతమార్గమున జనింపరు.

---

## తృతీయ ప్రకరణము – ఉద్యమస్థానము.

ఇతఃపూర్వమే కార్యస్థానము వివరింపబడినది. అట్టి కార్యస్థానముయొక్క దండెక్రిమోన్నతమును జెందుచు, నాసికతుదిభాగవఱకు వర్తించిన నట్టివాడు జీవితప్రారంభము నుండి యంతముచెందుదాక నున్నతినొందుటయకాక, వాని కార్యములు సంకల్పమాత్రముననే విజయము నొందుచుండును. అట్టికార్యస్థానము మార్గమని భావింపుడు. దండెయందు నిమ్నోన్నతములు, వక్రగతులు, వాలును, కలిగిన జీవితారంభమునుండి తుదివఱకు కష్టముల నొందకతప్పదు. కావున కార్యస్థానము జీవయాత్రారథమార్గము.

ప్రస్తుతము ఉద్యమస్థానమును ప్రస్తావించుచున్నాను. ఉద్యమస్థానభాగపు తెల్లలేవియన, నల్లగుడ్డుయొక్క దక్షిణవామపార్శ్వములందలి తెల్లగుడ్డు మానవునకు నేత్రద్వయమందుండును కదా! నేత్రద్వయమందలి నల్లగుడ్డుకు నలువైపుల తెల్లగ్రుడ్డుండును. వానియందలి రక్తరేఖలు, మానవజీవితమునఁ గలుగు నుద్యమములను వివిధగతులఁ దెలుపును.

అట్టినయనద్వయమందు నాలుగుభాగములుగ నేర్పడిన తెల్ల గుడ్లభాగముల, నుద్యమస్థానమని సాముదాయక నామ మేర్పడుటకు హేతువు. తనుస్థానయనమునగల శ్వేతనేత్ర ద్వయమునుబట్టి స్వీయపరిస్థితులను, ఉద్యమవిషయములను, కళత్ర, భర్తృస్థానగత, శ్వేతనయనద్వయమునుబట్టి, భార్య యొక్కగాని భర్తయొక్కగాని యుద్యమస్థితుల వివరింప నగును. కాన నుద్యమస్థానమును మోటారుబండితో నుప మింపవచ్చు. కార్యస్థానమనుబాట సవ్యాకృతిగల దండె చేరువనున్నచో, నుద్యమస్థాన రేఖల (రక్త) బలాధిక్యము కలిగిన కార్యములందలి యుద్యమాదులు తీవ్రగతినినడుచుచు, జయము, పలుకుబడి, నామవ్యాపకము, ఘనతయును జీవి తాంతమును జేకూర్చును. చతుర్విధ శ్వేతభాగలకు పారిభాషి కములుగలవు. దక్షిణ నేత్రస్థ శ్వేతభాగను బ్రహ్మోద్యమస్థాన మనియు వామభాగత శ్వేతభాగమునకు విష్ణూద్యమస్థాన మనియు, ఎడమకంటి కుడి తెల్లగుడ్డుభాగమునకు రుద్రో ద్యమస్థానమనియు, ఎడమ శ్వేతభాగకు శక్త్యుద్యమస్థాన మనియు నెఱుంగునది.

ఈప్రకరణమునగూడ మానవశరీర మర్ధనారీశ్వరమని గుర్తించునది. పురుషుని వామనేత్రము కళత్రస్థానభాగ సంబంధియనియు, స్త్రీవామనేత్రము తనుస్థానమనియు, స్త్రీ యొక్క దక్షిణనేత్రము భర్తృస్థానమనియుఁ దెలిసికొని యీప్రకరణమున ఫలములఁ దెలిసికొనునది. ఉద్యమము,

ఉపక్రమము, ఉద్యోగము, పైపదములు ప్రయత్నము అను నర్థబోధకములు. కార్యస్థానమున (అనగా) దండెయందు నిమ్నోన్నతములుండి యుద్యమస్థానమందలి రక్తరేఖలు మిగుల స్ఫుటమను బలమును చెందినచో నట్టివానియుద్యమములు నెరవేరుటలో మిగుల నొడుదొడుకులు కలుగును. దానికుద్యమస్థానస్ఫుటమే ప్రధానహేతువు, కార్యస్థానమున (దండెయందున) నిమ్నోన్నతములధికమై యుద్యమస్థానము న్యూనతేజముకలదైన కార్యోద్యమములు మందగతిలో జరుగుచుండును. ఇట్లు కార్య, ఉద్యమసమ్మేళనమొనర్చి కార్యగతోద్యమముల తెలుపునది. త్రిపుటీస్థానమందలి దక్షిణవామనయనములు సూర్యచంద్రస్వరూపములని సనాతనార్యవచనములు. ప్రశ్నఫలవిమర్శ చేయునపుడు దక్షిణవామనాసికారంధ్రములందలి నాడీప్రసారగతి ననుసరించి ప్రశ్న వేయబడినవానిప్రశ్నయొక్క రీతిని నిర్ణయించుచున్నది. నాసికాప్రారంభస్థానము త్రిపుటీస్థానములో ప్రధానమగు సుషుమ్నాభాగకుం జెందియున్నది. ఈరీతిగం బురుషునకు కుడికన్ను స్త్రీకి యెడమకన్నును అదిరిన (స్పందించిన) శుభసూచకమని శకునశాస్త్రము చాటుటయేగాక మన యనుభవమునగూడ కలదు.

—: ఫ ల ని ర్ణ య ము :—

ఏమానవుని యుద్యమస్థాన రక్తరేఖలు, నిలువుగగాని, ధనురాకృతిగగాని సరళరేఖగాగాని వర్తించిన వాని

జీవితము సరళముగఁ గడుపబడును. అట్టిరేఖలు దశాధిక్యము నొందిన ఘనసంస్థలకు గౌరవోద్యోగియగును. (అనగా రాజకీయసంస్థ, మిల్లులు, కర్మాగారములు, గొప్పముద్రణాలయములు, మొ॥వాని కధ్యక్షులుగా నుండురు.) పైసంస్థలలో గల లోపముల సవరింప సమర్థులుగాగలరు. అట్టి యుద్యమస్థానరేఖలు రక్తవర్ణము, స్వల్పదశాధిక్యతకలిగిన నట్టివాడైనన్న దగిన కృషి యొనర్చువాడుగను, ఏయుద్యమస్థాన మట్టివిధముగ వర్తింపబడిన నాయుద్యమస్థానమున కనువగు యోగ్యతలు, విశిష్టతను, తనుగ్మలకలాభ, సంతోషమును నొందక తప్పదు. తత్కాలానురూపోద్యమస్థానములందు చాకచక్యము, నైపుణ్యము శీఘ్రగతి, లోనగు కార్యసాధనానుకూల యావత్పరికరములఁ బూర్ణముగ నొందగలడు. రక్తమయరేఖలు దశాధిక్యత నొందినచో విశేషరాజయోగము. (అనగా ఉద్యమసాధనయందు ఫలముద్యమగతిపై నాధారపడియుండును. గాన నియ్యది యుద్యమగతుల నిర్ణయించును. ఉద్యమస్థానమందు గాఢరక్తరేఖలున్న నదృష్టవంతము. అట్లే రేఖలున్నవారు తమపితరుల జ్యేష్ఠసంతతివారుగను గృహయజమానులుగను (లేక) గృహకార్యనిర్వాహకులుగనైన నుండకతప్పదు. (అన్యులైనను నితరుల వ్యవహారములఁ జక్కఁబెట్టువారగుదురు) అట్టివారి స్వభావము, కార్యదీక్ష, పౌరుషము, ఔదార్యాదిగుణవిశిష్టమై యుండును, పెద్దరికమునకై పాకులాడెదరు. అట్టి

వారిమాట సామాన్యమా నవవాక్యములకన్న విలువగలిగియుం డును. మానవుల చతుర్విధోద్యమస్థానముల శాతమును (అనగా 100కి ఎంత) స్ఫుట, సవ్య, అపసవ్య, వక్రితాధిక సరళరేఖాకృతులు ప్రవృత్తియందును, గుర్తించుచు సమ దృష్టితో గమనించి ఫలనిర్ణయ మొనర్పనగు. ఇట్లు నాలుగు ఉద్యమస్థానములను గుర్తించినచో మానవులజీవితము, కళ త్రము, భర్త, వీనియొక్క యుద్యమాది యావత్పరిస్థితు లును పూర్తిగ తెలియగలవు. ఎఱుపుజీవయనురేఖ పూర్ణ సవ్యాకృతి, సమదళవర్తనము, తేజోవంతమును జెందినచో నట్టియుద్యమస్థానకాలమున, ఉద్యమస్థానగతరేఖాబలమువలన నాకాలము లాభదాయకమై విదేశములందును పేరు, ప్రతి ష్టలు, గౌరవాధిక్యతనుపొందుట తథ్యము. అట్టికాలమునం దానొనర్చుకార్యములు తప్పకవిజయము నొందును. ఇట్టి యుద్యమస్థానరేఖలు చతుర్విధోద్యమములందును, సమదళ వర్తన, స్వచ్ఛరక్తవర్ణము, సరళరేఖాకృతిగలరేఖలు సరళ గాంభీర్యమును సూచించురీతిలో నున్నచో రసవంతము, మృదుమధురమునగు ప్రౌఢవాచాలతయు, లలితకళాశ్రవణ, గ్రహణ, ధారణపరతయు, బహుజనశ్లాఘ్యకార్యకలాపము లతో ఘనకార్యసాధకుడై యుత్తమజీవిగా పరిగణింపబడును. పైసూత్రపద్ధతుల కేవియేని విరుద్ధములైన సద్యఃఫలములలో విరుద్ధవ్యత్యాసములు కలుగును. కొన్నిస్థలములందిట్టి మిశ్రమ న్యాయము నొందును. అత్తరి మిశ్రమఫలమునే చెప్పనగు.

భూస్థానమందలి సూత్రపద్ధతి నిందుగూడ దశాధిక్యమునఁ గలుగు ఫలవిషయమున శుభప్రదమైనను, ఉద్యమతరతమ భావమను నాధిక్యము నొందుటవలన, స్వీయోద్యమములం దితరులకన్న విద్యాయోగము, ఉద్యోగాదులలో గౌరవపద వులయందధికుడై యుండుట, ఏవిషయమునైన పూర్ణముగ గ్రహించి కార్యమును సానుకూలముచేయు సమర్థతనొందక తప్పదు. ఇంకను ఉద్యమస్థానములందు పైపద్ధతుల ననుగ మించి రేఖలుండి యారేఖలు అధికదశముగ వర్తించుచు, పటాకృతిని జెందియున్నచో నట్టియుద్యమస్థాన(లేక) సాధన ముల కాలములందు రాజకీయరాయబారిగాగాని, రాజ్య తంత్రనిపుణుడుగగాని, మతవిషయకకల్లోల సమయమున శాశ్వత మతస్థాపకత్వము, సంఘసేవ, కార్యసాధనము మొద లగువానివలన వాసికెక్కు వాడగును. అట్టివాడు జీవితకాల మున సర్వలోక విదితుడగును. రేఖ సమదశన్యాయముకన్న కాంతివంతము ప్రధానముగతగ్గిన, ఉద్యమగతియొక్క ఫల వివరము నివృత్తి ననుసరించి తగ్గుచుండును. పైనివక్కాణిం చిన పటవర్తనానుసారము వర్తింపబడక రక్తము, ముద్ద ముద్దలుగ అట్టిస్థానమునగల రేఖలందు వర్తింపబడిన, సుప్ర సిద్ధకర్షకులుగను, భూములను సారానుగుణముగ నధికఫలము నొందగల మేధయు, నైపుణ్యము కలవాడగును. ఇట్టివాడు చిన్నయుద్యోగమునమన్నను మిక్కిలి పలుకుబడి కలవా డగును. కర్షకుడైనచో పలువురు తమభూములను సాగుచేయ

నిచ్చెదరు. అట్టిభూములకు సారముచేసి ద్విగుణీకృతమగు ఫలము నొందువాడుగ నుండును. తననాఖరుదు భూములను వరగట్టి తనస్వాలమున ద్రివ్యము నార్జించుకొనగలుగును. తాను సేవ్యమొనర్చు పెరలభూముల శిస్తు న్యాయముగనిచ్చువాడు, తన కులజనులలోఁ దగువరిగను, స్వీయావసధమున మిగుల పూజింపఁబడువాడు, ఆపత్సమయమున బరులకుచిత సేవ నొనర్చువాడుగ నుండగలఁడు. దళపూర్ణ సవ్యాకృతియు, రక్తవర్ణము కలిగిన భూముల వరగట్టించి ఫలవృక్షాదులవలన విత్తమార్జింప కృషిచేయుట, ఫలించుటయు జరుగును. అధికదళ పటవర్తనలుగలవారియెడ విశేషించి నుడువవలసినదిలేదు. అట్టివారిభూములు సవ్యమార్గకృషులవలన నధిక ఫలవంతములుకాన విశేషధనము నొందుదురు. ఉద్యమస్థానప్రదేశమున రక్తపిటకలు కనుపించిన, సాగుహక్కుతో కౌలుభూముల కధికారియగును. సమదళవర్తన ననుసరించి రేఖలు ఏకరాశిగ వర్తింపబడిన స్వభాషాప్రదేశమున వ్యాపార మొనర్చువాడుగ నుండును. పటాకృతులున్నచో స్వదేశమున వ్యాపార మొనర్చువాడగును. అట్టివానిఫాలము నిమ్నముగనున్న ఖండాంతరవ్యాపారియగును. నేత్రమునందు రక్తపుజీరలున్నచోక్రిమినల్ (స్వంత, ప్రైవేటు) కేసులలో ఫిర్యాదిగగానిసాక్షిగనైన కాకతప్పదు. చతుర్థోద్యమస్థానముల శాతములేనిచో పుట్టినదిమొదలుగిట్టువఱకుపరపోషణమునను౦డును. స్వతస్సిద్ధమగువ్యవహారపుసమర్థతరవంతయు నుండదు,

కార్యస్థానము పెక్కు మిట్టు పల్లములుకలదై ఉద్యమస్థానముల రక్తపుముద్దలవలె నున్నచో నట్టివాడు క్రిమినల్ కేసులో ముద్దాయిపక్షమున సాక్ష్యమీయవలసివచ్చును. అట్టివాని వృత్తివ్యవసాయమైయుండును. అట్టినరుని నాసాదండమున, ఎత్తుపల్లములేగాక వామపార్శ్వగతి విశేషముగ సూచించిన నట్టివాడె ముద్దాయిగ నుండగలడు. కార్యస్థానముయొక్కదండెయందు ఎత్తుపల్లములుండి, నాసాంతభాగ మెడమకు వంగియున్నచో తాను స్వార్జితముచే గృహమునుగొని, పిత్రార్జితగృహమందలి హక్కుభుక్తముల విడిచి యన్యప్రదేశమున వ్యవసాయముచేయుచు, పర్యాయముగ లాభనష్టములఁ బొందుచు తుదకునికరలాభము నొందువాడై యుండును. ఏమానవుని కార్యస్థానము సౌమ్యాకృతి నొంది, నాసికతుదభాగ కొంచెరువర్తనను జెందినచో చతుర్విదోద్యమస్థానములందలి రక్తరేఖలు పూర్ణరక్తవర్ణమునొందిన పూర్వార్జితక్షేత్రములవలన నర్థలాభము నొందుటయు, వ్యవసాయపరికరములు, మదుపులు మొదలగువానికై యధికధనవ్యయమొనర్చుచు, పిత్ర్యనివాసమునువిడిచి సమీపస్థపట్టణవాసముచేయుచు, రమ్యప్రదేశమున సౌధమును నిర్మించుటయు, వేషభాషలకై విశేషధనమును వ్యయమొనర్చి ఋణగ్రస్తుడై ఋణాపనయమునకై స్వనిర్మితసౌధమును విక్రియించువాడగును. పైరీతిలోఁ గార్యస్థానము కుడివాలును జెందిన పైవిధమునకు లోనగును. ఆపట్టణ పరిసరమున ఇస్తువాలుగలభూమిని-సంపాదించి యందే సామాన్యగృహమును

నిర్మించుకొనును. స్వీయానందమునకై యశ్వమును సంపాదించును. తనుకళత్రస్థానోద్యమస్థానములను చతుర్విధోద్యమస్థానముల శాతబలాధిక్యములను జూపుచు, శార్యస్థానమను నాసాగ్రము 'కొటేరు' ఆకృతిలోనుండి ప్రతియుద్యమస్థానమందు 1/3భాగ రక్తరేఖలు పూర్ణసవ్యసహజాకృతులఁ జెంది రక్తయుక్తమై తేజోవంతమును జెందిన, మహారాజులకుగాని, రాజులకుగాని, దత్తపూర్ణాధికారమున రాజ్యాధిపత్యము నొందినవారికిగాని, తత్తుల్యులకుగాని, భోగకాంతమైవిశాలప్రదేశమున సౌధనిర్మాణ మొనరింపజేసికొని స్థిరాస్తుల నొంది, వర్షాధారమున స్వంతముగ వ్యవసాయముచేసి ఘనవ్యక్తిగా పరిగణింపబడును. అట్టివ్యక్తియొక్క వ్యవహారముల జరుపు పురుషుడు రక్తసంబంధియై, బాల్యమున యంత్రసామగ్రిల నమ్మునంగడిలో చిన్నఉద్యోగిగా నుండును. నాసిక కొటేరుపద్ధతనివర్తించి, దీర్ఘమునొందిన, మొదట పలుతావుల సామాన్యులకడ చిన్నచిన్న ఉద్యోగములుచేయుచు నయోచితముగ భాగ్యమునొంది, పిమ్మట బంజరుభూములను మెట్ట, పల్లపువ్యవసాయముల కనువగురీతిగనొనర్చి, జలాధారమునకై తటాకాదులను త్రవ్వించి యటనేదేవాలయమును ప్రతిష్ఠించి, శాక్తేయుడై యొప్పగలఁడు. అట్టివాని రక్తబంధువగు స్త్రీ ముఖాసాదారులుగ నుందురు. చతుర్విధోద్యమస్థానములందు సహజాకృతిగల రక్తరేఖలు అధికదళమును జెంది, లేతరక్తవర్ణమునకు తుల్యవర్ణము

నొందియు నారక్తపర్ణము గాఢత్వమునుజెంది, కార్య స్థానము తగుదీర్ఘమునొంది, సౌమ్యాకృతిని జెంది, నాసాగ్రము కొంచెరుపద్ధతికిలోనై కుడివాలునొందిన, త్రయో దశవర్ణప్రాయమున నే తండ్రికపరకర్మనాచరించి, అనుజత్ర యమునకు విద్యాబుద్ధుల నలవరచి ప్రయోజకులుగ జేయు వాడగును. ప్రథమకళత్రవియోగమునొంది, సీలిమందు ఫేక్టరిని గుత్తచేసి విరమించును. పిమ్మటఁ గొంతకాలము కఫవ్యాధినొందును. పిమ్మట ద్వితీయకళత్రమును స్వీకరిం చును. ఆమెవలన నొకకుమారుని బడయును. పుత్రునితోఁ గూడ ద్వితీయకళత్రమును గోల్పోవును. పిమ్మట తృతీయ కళత్రమును బొందును. ఆమెయందొకకుమారుని. ఇరువురి కుమార్తెలను బడయును. అట్టివాని తుదిపురుషసంతానము తనకనిష్ఠసోదరీల కిరువురకు వివాహాదుల నొనర్చును. పితా మహియొక్కగాని, సాపత్నిపితామహియొక్కగాని కర్మనా చరించువాడుగనుండును. స్వార్జితముతోఁబాటు పిత్రార్జిత విత్తమును వృద్ధిచేయువాడగును, కన్నతల్లియొక్క, దత్తత తల్లియొక్క, సాపత్నిమాత, వీరికర్మల నాచరింపడు. అం త్యావస్థలో బియ్యపుమిల్లునుగాని వేఱొకమిల్లునుగాని, నిర్మిం చువాడగును. ఇట్టివానికి మేహరణములవలనగాని, రాచ కురుపు మొ॥ వలన మరణము ధృవము. ఇట్టివాని వ్రాలు బహుపొందికగానుండును. ఇట్టివాడు మూలవ్యాధిచే బాధ నొందును మంచివ్యవహర్తయు లేఖరియునగును. వ్యవసా

యమునందు వైద్యమునందు నిపుణులై యుందురు. ఇట్టివాని కండగానుండుసోదరుడు 6,3, మాసములు ముందుగఁ జనిపో గలఁడు. స్వగ్రామమునకు సమీపగ్రామమున గృహనిర్మాణ మొనర్చును. అట్టిగృహము వృద్ధికిరాక వానినాఁడే శిథిల మగును. ఇట్టివానిజననమునకు ముందొకయాడుపిల్లయైనను గలిగియుండవలెను. మొత్తమున నిట్టివారదృష్టవంతులుగా నుందురు. తనకు పైనుండుసంతతి (తనతల్లిగర్భమున నిలువదు) ఏమానవుని తనుస్థానోద్యమస్థానములు స్ఫుటవంతము లుగనున్న కార్యములయందలి వివిధోద్యమస్థితులు సులభముగ నెఱవేరుట, నిర్ణీతకాలమున తటస్థించును. చతుర్విధోద్యమస్థానములయందున దోషములులేక సగటు స్ఫుటమున్న ప్రథమద్వితీయోద్యమస్థానములందు తేజోవంతము కలిగి యున్నచో పలువురు పుత్రులనొందుటకుగారణము. అట్టి పురుషసంతతి దీర్ఘాయువును, సౌమ్యత, ఆరోగ్యము, సౌందర్యము, విద్యాబుద్ధులు కలిగియుండును, అట్టివారి చతుర్విధోద్యమస్థానములు మిక్కిలి తేజోవంతములైన నార్యజాతి యాదిపురుషులవలెనుందురు. ప్రథమద్వితీయోద్యమస్థానము లందు అధికతేజోవంతమునొందిన, రసపుత్రవీరులవలె వర్తించుస్వభావముకలవారగుదురు. కళత్రస్థాన తృతీయ చతుర్థ స్థానములుమాత్రము మిక్కిలి కాంతికలిగియున్నపురుషుడు వివాహమునుండిగాని, లేక భార్య కాపురమునకు వచ్చిన నాటినుండిగాని ప్రతిష్ఠావంతుడగుట కారంభము క్రమవృద్ధి

నొందగలడు. పురుషుని కళత్రస్థానోద్యమస్థానములను మదో్ద్యమస్థానమునకు, శత్రుద్యమస్థానమునకును అత్యధికస్ఫుటత్వము, అధికదళవర్తనయుగల సవ్యాకృతిరేఖలుండి తనుస్థానోద్యమస్థానములను బ్రహ్మోద్యమస్థానము, విష్ణూద్యమస్థానములు స్ఫుటహీనములైయున్నచోఁ దప్పక స్త్రీసంతతి నొందును. ఉభయోద్యమస్థానములు స్ఫుటమునందును, అధికదళమునందును ఈషద్రక్తవర్ణమునొందియు రేఖలు క్రమాకృతులనుజెందియున్న స్త్రీపురుషసంతతి నొందుట నిర్వివాద విషయము. అట్టిసంతతి ఆయురారోగ్యైశ్వర్యవిద్యాబుద్ధులను ప్రేమపూరితసపర్యల నధికముగనొందగలరు. అట్టివారలు పొందుసంతానముకూడ వంశానుక్రమవిధుల ననుసరించియుండును. సౌందర్యయుతముగ నుండును. ఇట్టివారు, లోకమునకాదర్శప్రాయముగ జీవించుచు, నూతనపరిశోధనలను అనువాదములను, ఏవిషయమునందైనను క్రమపద్ధతి నొనర్పగలుగుదురు. చతుర్విధోద్యమస్థానములందు రక్తము ముద్దగట్టునట్లగపడిన, నట్టివారు మితసంతతినొందుదురు. అధికరక్తరేఖలు జీరలనొందియున్న కొలదిగసంతతి కలుగుటయు, వారివలన నెట్టిసుఖమును బొందకుందురు. అనుజన్ములు మాత్రమందుబాటులోనుండుటచే సుఖము నొందగలరు. చతుర్విధోద్యమస్థానములందును నీలవర్ణముగలిగిన సంతాననష్టముకూడ కలుగును. అట్టిస్థానమున నల్లనిచుక్కలున్నచో, వారిసంతతి యంగవైకల్యమును లేక శాశ్వతరోగముల నొందు

టయు, తల్లిదండ్రులమాటల ధిక్కరించుటయు, కలిగియుం
డును. వికారము, చంచలస్వభావమును కలిగియుండును.
చతుర్విధోద్యమస్థానములందు దోషస్ఫోటమును లేకయున్న
నధికసంతతి నొందుటయు, మాతాపితల కుపచరించనివాడగు
టయు, దేశదేశముల చరించువారునై యుందురు. లేక రాజ
రోగమునకు గురియగుదురు. తుదకుఁ గొన్నితావులందు
సంతానము లేకుండును. లేకున్న నట్టివారిసంతాన మంత్య
క్రియలు చేయలేకుండుటయుగాని, దూరముననుండుటచే
సకాలమునఁ గర్మచేయకపోవుటయు, అనారోగ్యమువలన
నితరులచేఁ జేయించుటయు, నిర్లక్ష్యభావమున తమయనా
సక్తిని జూపువారునై యుందురు. ఉభయోద్యమస్థానములం
దును నల్లనిజాడలున్నచో నుభయసంతానములందును నష్ట
ముండును. మిగిలినసంతతిలోఁ బేర్కొనఁదగిన లోపములుం
డును. పైస్థానములందుఁ బూర్తిగజాడలున్నచో, 1, లేక
2, సంతానములుమాత్రముండును. అట్టివారిని కాకవంధ్య,
కదళీవంధ్యయందురు, జాడలుద్యమావరోధమును గాఢముగ
సూచించును. 3, సంతానములున్న పైవంధ్యాత్వము వర్తిం
పదనిశాస్త్రము వర్ణగాఢత్వముగల నల్లనిజాడలున్న 1, 2,సం
తానములుండును. అట్టివర్ణము నీరదవర్ణతుల్యంబైన యువకు
లగు 1, 2, సంతానములుగూడ గతించును. మేఘవర్ణము
గలస్థానము వెడల్పుగనున్న సంతానమే లేకుండును. ఇట్టి
వ్యాప్తి జ్యోతిషముననను, హస్తసాముద్రికమునను సర్వదోష

మని తెలుపఁబడెను. దానినే యంగశాస్త్రాంతర్గతోద్యాన స్థానమున నిరూపితమయ్యెను. సంతానము లేనివారును, సంతాననష్టము నొందినవారును, తద్దోషపరిహారమునకై శ్రీసుబ్రహ్మణ్యప్రతిష్ఠనొనరించిన, సంతాననష్టము లేకుండుటయు, సంతానముకలుగుటయు జరుగగలదు. ప్రతిష్టామాత్రమున తుష్టి నొందరాదు. సగుణదృష్టికలిగి యంగన్యాసకరన్యాసయుతముగ బీజాక్షర సంపుటిగావించి, సుబ్రహ్మణ్యమంత్రమును శాస్త్రానుసారముగ రూపయుతవిగ్రహమును జిత్రించి కళయను వీక్షణంబును నిడియుత్తముడు, సద్బ్రాహ్మణవంశసంభూతుడు, సద్ధర్మబోధ, వేదపాఠి, వేదోక్తకర్మల నాజీవమునాచరించువాడు, న్యాయమార్గానువర్తియునగు ఉపాసకునివలన నుపదేశమందవలెను. సగుణవిగ్రహమునకు ఆకర్షణయేర్పడును. అట్టి ప్రతిష్ఠాస్థలము జనాకీర్ణమై భక్తకోటి నివసింపదగు పవిత్రస్థలమగును. ఇట్టి యైహికవాంఛల నొసగుస్థానమునఁ బ్రతిష్ఠించి రాగభోగాదులనుదినమును నర్చకునివలన జరుగునేర్పాటు (ఉపాధి) నొనరింపవలెను. (ఎ) కానియెడ సంతతినొందకుండుట, (బి) ఉత్తమగుణ సంపదగల సంతానముకాకుండుట, (సి) ద్వాదశభావఫలములందును శేభాగఫలము నొందువారు నగుదురు. కానసగుణప్రతిష్టయు, రాగభోగాదులును కావింపనగు. అసమర్థులైనచో శక్తివంచనలేక దైవకార్యములందు సహాకారమొనర్పవలయును. అట్లు ఆచరించిన దోషము పూర్ణముగ హరించును. సగుణప్రతిష్ట ద్వివిధము, 1. పీఠబీజసంపుటి,

ఇయ్యాదిస్థాపనము శిఖరబీజసంపుటి (అనగా) కలశనిర్మాణము నందు గుర్తింపవీలగుచున్నది. వీనిని బీజప్రస్థారములందురు. శిఖరప్రస్థారమనినను నిదియేయని యెరుంగునది. ఇట్లు చతుర్విధోద్యమస్థానములు పూర్ణముగ మేఘవర్ణావృతములైన పూర్ణసర్పదోషమనియు, అట్లుగాక 4 స్థానములందును మేఘ వర్ణ నల్లనిచుక్కలున్నచో సర్పదోషమునఁ గొన్నిపాళ్ళు దోషము వర్తించునట్లుభావించి నిర్ణయింపవలసియున్నది. అట్టితరి గాఢమేఘవర్ణపుబిందువుల వ్యవహితముగ నున్న సర్పదోషములో (సంతాననిరోధకస్థితి) నర్ధభాగగతమేయని యెఱుంగునది. అట్టివానికి శ్రీసుబ్రహ్మణ్యప్రతిష్ఠ నింటిలోనే జేయించి యొకపూటనైనను నర్చనమునిష్ఠతోగావింపనగు. ఈ కలికాలమున మానవదృష్టియెట్లున్న దనఫలప్రాప్తియైనపిమ్మట విడుచుటయే కానవచ్చుచున్నది. సంతానసిద్ధియైనను శ్రీ సుబ్రహ్మణ్యస్వామిని నిత్యమారాధించుచుండిన స్వామి ప్రసాదమున సంతతి సుగుణాదిసత్సంపదకలదిగనుండును. సుగుణాదులకండగ సద్భావాదులు వానిసొత్తుగనుండును. విపులీకరణము గ్రంథవిస్తరభీతిచే విడిచితిని. దైవారాధన ఫలమును సుజనపండితముఖమునఁ దెలియనగు. తను, కళత్ర ఉద్యమస్థానములు స్ఫుటవంతములైన, కృషి, ఉద్యోగాది వృత్తులు ఫలవంతములగును. చతుర్విధోద్యమస్థానములందే యేయుద్యమస్థానము స్ఫుటమును, హీనమును, నూటికెంత వళ్లుకు చెందియున్నదో, అట్టివానిలో నొక్కొకయుద్యమస్థాన

మున నెంతెంతమేరస్ఫుటహీనమో, రేఖాకృతు లెంతమేర చెందియున్నవో, ఏ యే వర్ణములెంతవరకు చెందబడినవో గమనించి, తదనుగుణముగ ఫలముల వివరించునది. శాతము ననుసరించి సూక్ష్మదృష్టితో ఫలమును నిదానించునది. (ప్రతి యుద్యమస్థానమున, వర్తననిష్పత్తిని స్థూలసూక్ష్మదృష్టితో నిదానించునది) తనుస్థాన, ఉద్యమస్థాన, బలము, కళత్రస్థానోద్యమస్థానబలముల స్ఫుటముకన్నను ఆధిక్యమునుజెందిన స్వతస్సిద్ధమైనయోచన, స్వకార్యనిర్వాహకుడు, ధైర్యశాలి, ఆర్జనాపరుడునై "ఉత్తమం స్వార్జితం విత్తం" అనునుడి కుదాహరణభూతుడగు. ఆధ్యాత్మికజ్ఞానము, ఉదారత, నిర్లక్ష్యమునొందును. సూక్ష్మదృష్టినొందును. ఇతరులు చెప్పిన విషయములందలి యథార్థమును దెలిసికొనువాడగును. తాను స్వకృత్యములందు యథార్థమునుదెలిసి కార్యముల నాచరించును. పురుషకారమునఁ గార్యసాధకుడగు. ఉద్యమస్థానములకుతోడు కార్యస్థాననిర్మాణాకృతినిగూడ గమనించి, తన్నిర్మాణభిన్నగతుల సమ్మేళనతో ఫలనిర్ణయముల విపులీకరించునది. అనగా నట్టిసూత్రసాజాత్యములేక సమమగు దీక్షల నొందియుండనగు. ఉద్యమస్థానములందలి కాంతిహీనతకు తోడు కార్యస్థాన (నాసిక) దండెయందలి న్యూనాధిక్యములు, వాలు లేక వక్రతల ననుసరించి కార్యములందలి యు ద్యమా దు ల గ తి ని సామాన్యాసమాన్యమాస్వల్పాతిస్వల్పమా! అనువిషయమును సూక్ష్మబుద్ధితో ఫలవిమర్శ

గావింపనగు. తనుస్థానోద్యమస్థానబలమను స్ఫుటము బాగు లేనిచో సాహసములేనివాడగు. అట్టితనుస్థానబలము శూన్యమైన ఈషత్సాహసముకూడ లేకుండును. భీరువగును. పరాధీనవర్తనుడగును. తనుస్థానబలము సూక్ష్మరూపవర్తనంబైన, వర్తనానుసారము తనకూహలున్నను స్వతంత్రముగ కార్యనిర్వహణమొనర్పజాలడు. పరహస్తగతమగు చర్మభస్త్రిక వలెనుండును. తనుస్థానబలము క్షీణించి, కళత్రస్థానోద్యమస్థానబలము స్ఫుటవంతమైనచో భార్యకు లోబడువాడగును. భార్య, తల్లి, మాతామహి, పితామహి, మొదలగు సన్నిహితాసన్నిహిత బంధుస్త్రీలకు లోబడును. ఆస్త్రీలు గడసరులు. తెలివిగలిగి వ్యవహరించువారు, ఆధ్యాత్మికబుద్ధికలవారగుదురు. కళత్రస్థానోద్యమస్థానమునకు అత్యధికబల ముండుటవలన సంసారమును తగురీతిని నిర్వహించుటయందును, స్వకులాచారములను, విధ్యుక్తాశ్రమధర్మముల దీక్షతో నిర్వర్తించుచు వృద్ధినొందగలడు. ఇట్టిస్త్రీ విమర్శాపూర్వకముగ విషయమును విపులీకరించి లోకమునకు వ్యక్తపఱచుటయందును, మానమర్యాదలతో వర్తించుచు నాదర్శప్రాయమై యొప్పుచుండును. తనుకళత్రస్థానోద్యమస్థానములు స్ఫుటహీనతనుజెందియు, భర్తృస్థానబలము సామాన్యస్ఫుటవంతమై, స్త్రీతనుస్థానబలము శూన్యమైన సంసారమతిసామాన్యస్థితిలో నడుచుచుండును. కాని యిట్టియెడ, కళత్రముదుకుబోతుగను, చాకచక్యములేనిదిగను, పేదరికముచే బాధనొందునదిగను,

చిలిపిగుణములు కలదియు, స్త్రీసంతాననష్టమునొందినదియు, ఎడ్డిమనిషియై శుభ్రతలేనిదియు, ఇంటిని సరిగదిద్దుకొన లేనిదియు, దాంపత్యసుఖమును హృద్యముగ నొసగలేనిదిగ నుండును. ఇట్టియామెభర్తకు ద్వికళత్రమైయుండును. భర్త మదుపులేని యుదారపురుషుడుగ నుండును. గూనివాడై యుండును. స్త్రీయొక్కతనుభర్తృస్థానములు రెండును చెడిన యెడనిత్యము నిష్కారణకలహము కలిగియుండును. భర్తదుష్ట దానములగ్రహించి జీవించువాడుగనుండును. భార్య అపర కర్మలలో శూర్పదానము గ్రహించుచుండును. ఏనరున కైనను తనుకళత్రస్థానోద్యమస్థానముల స్ఫుటము తగ్గియున్న చో నట్టివారు రసవిషగంధకాదులతో నౌషధముల తయారు చేయువాడగును. లేక దగ్గఱనుండి యౌషధముల నిర్మింపఁజే యువాడుగనుండును. శస్త్రచికిత్సయందును నైపుణికలిగియుం డును. నిపుణముగ నౌషధములనిచ్చుటలో పేరొందును. గృహస్థుడగుమానవుని చతుర్విధోద్యస్థానములను, కళత్రము యొక్క చతుర్విధోద్యమస్థాగములను పరికించి పండితుడు ఫలనిర్ణయము గావింపనగు. బ్రహ్మోద్యమస్థానము, విష్ణూ ద్యమస్థానములను (ప్రథమద్వితీయోద్యమములు) దోషవం తములైనచో నట్టినరుని, విద్యయందు బాల్యమున తలిదండ్రు లొనర్చువిషయములం దవరోధ మేర్పడును. స్త్రీకి తనుస్థానో ద్యమస్థానములుగానోపు. రుద్రోద్యమము, శక్త్యుద్యమము లను గమనించి విద్యాకాలపుస్థితియు సంరక్షణాదులలో

గలుగు నవరోధములను విమర్శించుటకు తావుగలదు. తనుస్థానోద్యమస్థానములు రెండును స్ఫుటవంతములైనచో బాల్యమున విద్యయు, సంరక్షణాదులలో చేయు కృషులును ఫలించును. విద్య సూక్ష్మముగ లభించును. చదివించువారు ధనాఢ్యులై యుందురు. వారుండువసతియు సర్వసంపదలతో సర్వకాలమందు బాటులోనుండును. తనుస్థానోద్యమస్థాన బలములుమిగుల శాతబలము నందినచో విద్యయందుత్తమాది శ్రేణులలో నుత్తీర్ణుడగు యోగముండును. తప్పక నుత్తీర్ణవిద్యార్థులలోఁ బరిగణింపఁబడును. చతుర్థోద్యమస్థానములుస్ఫుటవంతములుగ నున్నచో విద్య, ఉద్యోగములు కలిగి వార్ధకమున మహానుహులై యుండనగు. పురుషునకు 1, 2 ఉద్యమస్థానములు స్ఫుటమునొందినఁ గొంతకాలము ఇల్లరికపుటల్లుడుగానుంచుట లేక దత్తుడగుట, అట్టి మైనారిటీకాలమున లాటరీవచ్చుట మొదలగునవి జరుగగలవు. తనసంరక్షకులు 1 లాటరీలు, 2 ఫజిలుస్, 3 ఉన్నతోద్యోగాదుల నొందగలరు స్త్రీకి చతుర్థోద్యమస్థానము, పురుషునకు ప్రథమోద్యమస్థానమును స్ఫుటమును జెందినచో ఇంటరు, ఎంట్రెన్సు పరీక్షలలో మేధావిగ నుండును పురుషునకు 1, 2 స్త్రీకి 3,4 ఉద్యమస్థానములు స్ఫుటవంతములైనచో విద్యాపూర్తినొందియు కళత్రము లేక, భర్తలను (అనగా) ఉన్నతవంశీయులు, ధనము, ఉద్యోగాదిపదవులలో ప్రతిష్ఠనొందినవర్గములఁ బొందగలరు. స్త్రీకి 4, 3,2 పురుషునకు 1,2, 3 ఉద్యమస్థాన

ములు తేజోవంతములై యున్న ఉద్యోగము, కృషి మొద లగునవి లాభదాయకములగుచుండును. స్త్రీపురుషులకు, భర్తృకళత్రస్థానమున 4, 5 ఉద్యమస్థానములు పాడై 3,3, ఉద్యమస్థానములు స్ఫుటవంతములైన ప్రథమమున కృషిరా ణింపక పిమ్మట చురుకుగ రాణించును. పురుషునకు 2 3. 4 ఉద్యమ స్థానములు స్ఫుటముగనున్నచో బాల్యమున విద్యనభ్యసింపక 18 వత్సరములు దాటినపిదప ప్రారంభించి, పెద్దశాటిని దాటి, కోటీశు ప్రాపుకలిగి, విద్యాధనములతో సంతృప్తుడగును. అధికవిద్యావంతుడై, మహారాజాశ్రయముకలిగి, ద్వివిధరూప ములైన విద్యాకళాసంస్థలకధికారియై, కంఠమాలయను రేఖావృ త్తిననుసరించి వాహనాదులనొంది రాణించును. అట్టియుద్యోగ గరిమగలపురమున నుత్తరదిశను విష్ణ్వాలయప్రాంతమున భవనము నిర్మించుకొనును. పురుషునకు రెండవయుద్యమ స్థానము బాగుండిన కళత్రము వచ్చినపిదప విద్యయుక్తి రాగ లదు. 1,2 లో వరుస ½ భాగలుగల ఉద్యమస్థానములు స్ఫుట వంతములైయున్న చిన్ననాడు తినతల్లిదండ్రులు ప్రభుత్వ దత్తస్థిరోపాధి (సేవ, మార్గనిరూపణ) నొందకతప్పదు, పిదప విద్యావ్యాప్తియగు. పిమ్మట విద్యలో నాధిక్యము కలుగుచున్నస్థితిలో నవరోధకపరిస్థితు లేర్పడును. ఏ ఉద్యమ స్థానము బాగున్న (స్ఫుటవంతమైన) నట్టి నిర్ణీతకాలములో జరుగు సర్వప్రయత్నములు లాభదములు, మనోహార ప్రశాంతినిచ్చునని పరిగణింపవలెను. కళత్రస్థానోద్యమస్థాన

ములు తేజోవంతములై యున్నయెడ సామాన్యవిద్యార్థిగ నుండి యుత్తీర్ణతయందును సామాన్యుడై యుద్యోగములేక, కృషినారంభించినదిమొదలు క్రమాభివృద్ధి నధికముగ నొందును. లోకమునఁ బ్రతిష్ఠయు కలుగును.

—: అక్షివిషయక వివరణము. :—

ఏ స్త్రీయొక్క నేత్రములు వర్తులముగనుండునో యా స్త్రీ ద్వితీయకళత్రముగగాని, అన్యవరదత్తయగుటగాని జరుగును. వివాహకాలమునాటికి జననీ జనకులుగాని, తాము నివసించు వసతిగృహముగాని యధికోచ్చలో నుండును. స్త్రీసంతతి నొందును. పురుషసంతతి నిలువదు. ఒకభాగమునకు నాయకత్వము నొందును. భర్త, సన్నిహితవారసుల ద్రవ్యము హరించును. భర్త గతించిన పిదప యావదాస్తులును సన్నిహితవారసులకే సంక్రమింపబడును. ఆమె, బలవంతముపై దత్తతచేసికొనును. దత్తపుత్రుడు వానిప్రథమపుత్రుడు ఆమెకపరకర్మ నాచరింపడు. మధ్యవయస్సునందే యామెకు వైధవ్యము సంభవించును.

---

## చతుర్థప్రకరణము – సర్వస్థానప్రాముఖ్యత.

ఇందు విచారింపఁబడు విషయములు 1. ఫాలము, 2. చెవి, 3. చతుర్విధోర్ధ్వమ స్థానసహితమగు నల్లగుడ్డు, 4. వ్యావహారికాధ్యాత్మిక జ్ఞానములు, 5. కార్యస్థానము,

6 ఓష్ఠములు, 7 దవుడలు, 8 గెడ్డము. ఇందు ప్రధానముగ గమనింపదగినవి, సౌమ్య, సరళ, స్పష్టవాదుల నిర్ధారణయు, తత్తద్విషయక ఫలనిర్ణయమునై యున్నవి. ఇందేయేస్థానములు, మిగుల సరళ సౌమ్యత్వాదులనొందినవో యట్టిసాముద్రాయక వర్తనానుగుణముగ రాజయోగ, అవయోగాదుల నొందుదురని ఫలవివరము.

1. ఫాలము:—ఇందడ్డముగ రుద్రాంశ రేఖలను విభూతి రేఖ లాయుర్దాయమును సూచించును. కావున కపాలనిర్మాణాకృతి ననుసరించి సౌమ్యవైశాల్యదైర్ఘ్యములు కలిగియుండి, శిరోజములవలన ఫాలపార్శ్వద్వయము నాచ్ఛాదింపబడకయు, శిరోజములవలన నుదుటపార్శ్వములందు ఆవర్తములు లేకున్న రాజయోగప్రదము. శిరోజములు ఫాలపార్శ్వములనుగాని, ఫాలమద్యభాగ, ఉపరిభాగయందుగాని ఆచ్ఛాదింపనిచో రోగములు, గండములును గలుగవు. గండాభావమున నాయుర్వృద్ధియు, రోగరాహిత్యమున దృఢశరీరము అను లాభద్వయసిద్ధి లభించును. ఇంతియగాక సౌమ్యఫాలాకృతివలన హంసవలె నామరణ ముత్తమజీవనము గడుపును. జీవనాధారస్థిరాస్తులు, తరంవారీపంటలు, జలాధారము, వశవర్తులగు సేవకులు, అనువగు పశుజాలము, తృప్తికరముగ ఫలించునవియు, సారము చేయనక్కఱలేక క్షేత్రము నేత్రానందమును జేకూర్చును. అట్టివాడు జనులచే నుత్తముడుగ కొనియాడబడును. న్యాయవర్తియునగు ఇతరులబాధింపడు,

తానొవ్వడు. సర్వసదుపాయాన్విత సుందరమందిరము కలిగి యుండును. ఇట్టివానిజీవితము శుభప్రదమై గడిచిపోవును. జనామోదప్రమోదవిలాసములు కలిగియుండును. ప్రజల కావేశము కలిగించి వారిసహకారమున జీర్ణదేవాలయముల నతిరమ్యముగ పునరుద్ధరించువాడగును. ఆగమానుసారముగ స్వల్పస్థలమున సుందర దేవళములను, మందిరములను, భవన ములను నిర్మించు కుశాగ్రబుద్ధిని పొందును. స్వ, పర, కార్య నిర్వాహకనైపుణి కలవాడగును. స్వగ్రామమందును, పరిసర గ్రామములలోగల జనులకడ చందాలు వసూలుచేయుటయే గాక, పనివాండ్రు నాసించకయే యింటకొక మనిషి చొ॥ రావించి జనోపయుక్తమైన పనులను వారి యాదరాభిమాన ములతో పూర్తి గావించువాడగును. ఎవనిఫాలము ఆధిక్య మును సూచించునో వారు పూర్ణవ్యభిచారులగుదురు. అనగా ఫాలభాగము పలుపుకలిగియుండును. ఫాలము చిన్నదిగనున్న విషయగ్రహణసూక్ష్మతయున్ననునారోగ్యముండదు. ఫాలము విశాలముగ నున్నను వెడల్పునకు తగినట్లుండిన (నిష్పత్తి) అధికాయువు నొందును. అట్టి ఫాలభాగమున నాయుస్సూ చక రుద్రాంశరేఖలు ఒకమూలనుండి మఱియొకమూలకు వ్యాపింపరాదు. వ్యాపించగ 'కలాపష్టిః' అను ప్రమాణ మును జూచుట కవకాశముండదు. ఫాలమునరుద్రాంశరేఖలు సరళరేఖాకృతి నొందియున్నచో శారీర, మానసికవ్యాధు లుండవు. (అధివ్యాధి) సరళప్రవృత్తి లేనిచో సంతానము

వలన సుఖముండదు. కొంతసంతతి నశించుటయు వయోధిక సంతానమొకటి నశించుటగాని, కళత్రనష్టముగాని జరుగ గలదు. అట్టినరుడు పితృదేశికమువలన మిగుల వాచాలు డుగ నుండును సౌమ్యసౌష్ఠవఫాలముగల మానవుడు, ఫాల ముందలి నిమ్నోన్నత నివృత్తిననుసరించి మెఱకపల్లపు భూముల నెంతంత పొందగలడో వివరింపనగు. దేహకాంతి కన్న ముఖకాంతి యధికమైన యోగదము. గాంభీర్యముగ నున్న కౌర్యము, సౌమ్యముగ నున్న భీతిని కలిగించి కార్య ములఁ జేయించుకొనును, ఆధారభంగముమాత్రముచేయడు. సమానాంతరరేఖలుకూడ నిలువుగ ఫాలోపరిభాగమువఱకు సుషుమ్ననుండి వ్యాపించునుగాన నిర్ణయప్రాధాన్యమధిక ముగగలదు.

2. శోత్రములు:—వైశాల్యమున కనుగుణముగ దీర్ఘ మునుగలిగి, దీర్ఘాకృతిలోనున్న, అద్వైతవేత్తగను, జీవాత్మ, పరమాత్మ తారతమ్యముల విశదీకరించుచు. జీవేశ్వరులొక్క టేయని తెలుపువాడుగను, మిగుల శ్రోత్రియనైష్ఠికత, కర్మ వాదియు, కర్మఠుడునై యొప్పును. అట్టి శ్రోత్రియులనొం దుటవలన నేకసంధాగ్రాహియగును. శ్రవణము, విమర్శనము విపులీకరణములయందు పటిష్ఠత భగవత్ప్రసాదలబ్ధమై యొప్పును. వేదాధ్యయనాధ్యాపకత్వములలో మిగులశ్లాఘ్య పదమునొందును. విశాల శృతులుగలవాడు కుండలా లంకృతుడగు. (కుండలంకర్ణవేష్టనం) అట్టినరుడు జీవితకాల

మున శరీరమందు వజ్రమును ధరింపగలఁడు. ఇట్టివాఁడు బ్రహ్మ వేత్తగాని, పీఠస్థాపకుడై దేశసంచార మొనర్చువాడుగగాని, గొప్పయుపన్యాసకుడుగగాని కాకతప్పదు. ప్రజాసంస్కర్త యు నగును. అట్టిశ్రుతులు మృదుత్వముకలిగి సూర్యరస్మి ప్రవేశింపననువుగ నుండవలెను. అపుడే సుహృదయుడగును.

ఏమానవునిచెవులు పటాకృతినుండునో వానిని వినాయకు డనుక్షణమును రక్షించుచుండును. ఇట్టివాడును మణుల ధరించువాడగును. చెవికితగిన తమ్మెలుండవలెను. సూర్య రశ్మిప్రసార్హముగ నుండవలెను. అట్టినరుడు వేదాధ్యయనాదులందు ఘనతనొందును. బోధకుడగు కాలానుగుణముగ హృదయరంజకుడగును. జీవేశ్వరభేదస్థితిని గాఢానురక్తిగల విజ్ఞానియై, స్వీయానుభూతిని లోకమునకు వ్యక్తపఱచును. భగవల్లీలను రాగభోగాదులందును, నర్చనయందును ఆసక్తుడై యితరులఁ బ్రోత్సహించు శీలవంతుడగును. మిశ్రజాతికిచెందిన చెవులుకలిగిన నవయోగము. చెవులకు, ఛిద్రములు, కోసులు, కోణములు, నుండరాదు. మృదువులై యుండవలెను. అట్టితటి చక్రనిలేఖరియగు. సౌష్టవముకలిగి తీర్చినట్లు చెవియంచులున్న రాజయోగము. తమ్మెయు మిశ్రజాతికిచెందిన నవయోగము. యావచ్ఛరీరచర్మముద్వార సూర్యకాంతి ప్రసరింపవలెను. కొన్నితావులకాంతి తేజముల, వెదజల్లు దేహకాంతిని గలిగియుండవలెను.

(3) చతుర్విధోద్యమస్థానములతోనొప్పు నల్లగ్రుడ్డు కలనేత్రము. చతుర్విధోద్యమస్థానములు.




(కిసు౨)

A. పై కంటిభాగము.
B. క్రిందిభాగము.
M. నల్లగ్రుడ్డు.
(1) బ్రహ్మోద్యమస్థానము
(2) విష్ణూద్యమస్థానము.
(3) రుద్రోద్యమస్థానము. (4) శక్త్యుద్యమస్థానము.

పైపటమునందు నయనోభయపార్శ్వములకు చతుర్విధోద్యమస్థానముల వర్తింపచేయునది. కార్యములయందలి బాగోగులను ఉద్యమస్థానములనెడి గమనస్థితిని తెలిసికొనవలెను. నీలాండగతతారక, పరమాత్మస్వరూపము. గ్రుడ్డు సహజనైల్యమును జెందినసహజమానవధర్మములను, ఆచారములను, శృతిస్మృత్యుక్తప్రకారము నాచరించువాడగును. అట్టి నల్లగ్రుడ్డు తేజఃపూరితమైనయెడ సంఘమున సరససరళజీవితమును గడుపుచు గౌరవింపబడువాడగును. వానిజీవితమున కార్యములు సూక్ష్మముగ శ్రమలేకయే ఫలించును. నల్లగ్రుడ్డునకు కాంతియున్న శుభప్రదము. అట్టిగ్రుడ్డు యొక్కపాప (తారక) యెంతకాంతికలదై గ్రుడ్డువర్ణమునే కలిగిన నాధ్యాత్మికచింతలు, యోచన, రచన, పరిశుద్ధములైయుండును. చంచలదృక్కుగలవారు సరిగ విషయముల గ్రహింపనేరక, విషమార్ధసృష్టులై సర్వవిషయములందును నీచస్థితినొందుదురు. అల్పవిషయమున కాధిక్యమును

గల్పింతురు. గ్రంథపఠనము నిష్ప్రయోజనమని తలంచక పఠింతురుగాని మరలదానిని సమన్వయించుశక్తిగాని, లేఖనోపన్యాసశక్తులుగాని యుండవు.

మొల్లకన్ను:—ఇది పురుషునకు, కుడికంటియందును, స్త్రీకి ఎడమకంటియందును సదృష్టద్యోతకము. మొల్లకంటివాడితరులు దూరముగనుండి ప్రసంగించుచుండ నది స్వవిషయమేయని భావించుచుండును. స్త్రీకి కుడివైపు మొల్లయున్న భర్తృవైముఖ్యమునొందుట, భర్తృవియోగమునొందుట, భర్తదేశాంతగామియగుటగాని, ఉన్మాదినియగుటగాని జరుగును. అట్టిస్త్రీ పురుషునివలె వ్యవహరించును. అసమర్థతయునుండును. అట్టియామెకు సంతానమున్న భర్తసాంగత్యమనతికాలమే యుండును. పుత్రుడవివేకియగుట వానివలన సుఖముండదు. అదుసుకండ్లుగలస్త్రీ పురుషులున్నతవంశమున బుట్టినను, ఔన్నత్యమునొందినను నచిరకాలముననే దరిద్రులగుదురు. స్వస్థానభ్రంశమునునగు. అల్పోద్యోగియైయన్యుల సేవించుచుండును. భవనైకదేశమున నివసింతురు. అదుసుకండ్లుకల స్త్రీపురుషులు, కురుచదేహము, అర్భకత్వమును కలిగినదంపతులయ్యెదరు, భార్యాభర్తలలో నొకరికివైవర్ష్యమగుదంతములుండును. చీపికండ్లుకలవారు, సంపన్నగృహసంజాతులైనను ప్రథమసంతానానంతరమున నిర్ధనులగుదురు. పితృవంశమును విచారింప భూసంపన్నులైనను, మంచిలేఖరులైనను, విలాసాదిగుణవంతులైనను, తమస్థితిననుసరించి.

సారస్వతమునకు, దేవాలయాదులకు, స్థిరరూపముగు శాశ్వత కార్యములలో గొన్నింటిని జటిపెదరు (శాశ్వతకార్యములు అన ఆలయనిర్మాణము, జీర్ణోద్ధరణము, ధ్వజస్థంభస్థాపనము మొదలగునవి. పితృవంశమువారు కర్మకులై యుందురు. జాయాపతులవంశములు పరమపావనసనాతనాచారపరులై సను ముంగోపముకలవారై క్రిమరీతిలో జీవితమును గడపు కొను చాక చక్యములేకయుందురు. నష్టజాతకులు (సంతాన నష్టము)గ వర్తింతురు. ఐకమత్యముండదు. మాతృవంశీయుల పరమలుబ్ధులుగను, సాధారణస్థితినుండి, ధనమునొందినవా రుగనుందురు. అల్పనేత్రములు కలవాడు ద్వాదశవర్షప్రాయ మున, తండ్రిగాని, ప్రేమించు సంరక్షకునిగాని కోల్పోవు టయు, విద్యాభ్యాసమున కవరోధము కలిగినను విద్యాధికు డుగ పరిగణింపబడును. సన్నిహితస్త్రీరక్షణమున గొంతకాల మైనను, విద్యనభ్యసింపక తప్పదు. గొప్పవారియసగాడై కులక్రమాగతవృత్తినే కొంతకాలముచేయును, ఆర్జకుడగును. ద్వికళత్రమునుగాని, పునర్వివాహము నుగాని పొందకతప్పదు మధ్యవయస్సునందు యుద్ధమునకుగాని, పితూరీలకుగానిలోబ డకతటస్థమార్గమునొందగలడు. మతావేశపరుడై నిత్యానుష్ఠాన పరాయణుడగును. ఘనభవననిర్మాతయగును. మరణసమ యమునకు ఋణములుండును. పుత్రులవలన సౌఖ్యమనుభ వింపజాలడు. ఇట్టియవ్వాతలు స్త్రీకి పట్టినచో భర్తకు సమ న్వయింపవలయును, పురుషవిషయకద్వికళత్రయోగమును,

స్త్రీవిషయకపునర్వివాహకయోగమును నిర్ణయానురూపమై యున్నది. విశాలనేత్రులకు, యాజమాన్యము, అనేకులనేక విధముల కోరికీకరించి, మంచిగను, బెదిరించియు, సౌమ్యముగను వశముగావించుకొనును. ఏతాదృశపురుషుడు బహు భార్యలుకలవాడగును. (భార్యగతించిన మరియొకభార్యయని తెలియునగు) ఇట్టిస్థితిలో చలనములేని యొక జీవరాసికి పవిత్రస్థానమునిడి పిదప, పూర్తికీడుజేయును. అట్టియెడ నాఖరుభార్య స్వేచ్ఛాసంచారిణియై యుండును. స్త్రీకిని, నేటి కాలపుభర్తలసంగతి వర్తింపజేయవలయును. ఇట్టివారు జనుల కష్టసుఖములలో భాగస్వాములగుదురు. ధర్మబుద్ధితో నితరుల నాదరింతురు. సోదరీసోదరులయందతిప్రేమాదరములగలిగియు యుందురు. శూన్యమాసమున గతించెదరు. తోబుట్టువులు లేనిచో నితరులకే, సహాకరింతురు. భావమేమన పెద్దవైనట్టి (విశాల) కంటితెల్లగుడ్డునందు రక్తరేఖలు అధికదళయుత పటాకృతితోడను (లేక) తుదకు, సమదళవర్తనతోడను వర్తింపవలెను. నల్లగ్రుడ్డు సహజనైల్యము కలిగియుండవలెను. మిరిమిట్లుగొలుపుకాంతియు, సౌమ్యజీవికి సహజముగనుండు చిహ్నము. మానవనీతి యట్టి మానవునందే మూర్తీభవించును. కంటిపాప (తారక) నీలకాంతియుతమైన నుత్తమోత్తమకార్యముల నాచరించును. పరలక్ష్యముక్రింద జీవితార్థభాగకాలము, కర్మవిధుల ద్వారా వెచ్చించనగు. నల్లగుడ్డు మిశ్రవర్ణయుతమైన భిన్నఫలముల నొందవలసి వచ్చును.

శ్వాన, మార్జార నేత్రములవలె గ్రుడ్లున్న తత్తద్గుణయుతు డగును. ఇట్లే జంతుజాలముల పోలికలుండును. గూబకన్నుల వంటి కన్నులున్నచో మహారాజైనను నింటదీపమునకుగూడ దిక్కులేకయుండును. జీవకళత్రద్వయము గలిగియుండును. ఇచ్చకములకు వశుడగును. భావిజీవితమును గుర్తింపనేరడు. నేత్రమందు నీలతారకాస్థానమున, వ్యాఘ్రనయనచిహ్నము లున్నచో విశాలస్వీయకుటుంబపోషకుడుగను, వశవర్తియగు బంధువర్గముండుటయు, పెద్దసంస్థకధిపతియై కొనియాడదగు ప్రతిష్ఠను సహించువాడై యుండును. అట్టిగొప్పసంస్థకట్టి మహానీయుడే యర్హుడని లోకము తలచునట్లుండును. వాని నెఱింగినవారందరు 'బెబ్బులి' యనునట్లు సహజబిరుదాంకితు డగు. అట్టివానికి సంతతియుండదు. కంటిగుడ్లునందలిపాపకు తగునట్లు ముఖము, దంతము లున్నచో నిశ్చయముగ ఫల ములవివరింపనగు. కడుసన్నిహితకుటుంబమునుండి పుత్రస్వీ కారమునొందును. తానెట్టిసంస్థకధిపతియయ్యెనో యట్లే దత్తుడును, పూజ్యవంశసంజాతులచే నాధిపత్యమువహింప బడినసంస్థలో సమర్థుడగు నుద్యోగిగనుండగలడు. తన యధి కారముగల సంస్థయందును గొలదివత్సరములు వ్యక్తిత్వము నొంది యనంతరమట్టిసంస్థయం దున్నతాధికారియగును. వానరముఖముకలిగి గుడ్లుమిటకరించువాడు నీచాతినీచుడై యభక్ష్యాన్నభక్షకుడగును. సద్వంశమునబుట్టినను నీచగ్రహ త్యములకిక్కువై, పరపతియు, దిక్కునులేక మృతినొందును.

తీక్ష్ణదృక్కుగలవాడు సూక్ష్మగ్రాహియైనను విశ్రాంతిలేక యుండును. తీవ్రవేదనాకార్యముకలవాడగును. గుడ్లెక్కువెట్టిచూచువాడు, సామాన్యములను ఘనకార్యములను బుద్ధితో సాధించి సంతసించును. 1/8, 1/16 వంతుఫలము నొందును. దురాశాపరుడు, కోరికలీడేరవు. ఓరచూపుకలవాడు, కొంతకాలము మహామేధావియు, బాల్యమునమాతృబంధుగృహమున నివసించువాడుగను, భాషాజ్ఞానమధికముగ కలవాడుగనుండును ప్రక్కచూపులవలన నున్నతస్థానము నొందజాలడు, సమదృక్కుగలవాడు సహజముగ సదృష్టవంతుడగును. జీవనమునకున్న విత్తముతో తుష్టినొంది సద్వర్తన కలిగియుండును. భూమి దెసచూపులుగలవాడు దొంగబుద్ధికలవాడు. అనగా చోరుడుగాడు. ఎవరేమిచేయుచున్నదికని పెట్టుచుండును. భీరువుగాని రోగిగానియగును, వోఱచూపులుకలవాడు క్రూరస్వభావమునొందును. తెలిసియు దెలియని యమాయకత్వమునొందును. మోటుగ సరసోక్తుల నుడువును. కలువ, తామర, పువ్వులవంటి నీరుకల నయనములున్నవాడు పేదకుటుంబమున బుట్టినను ధనవంతుడ గు ను. సా మా న్యో ద్యో గ ము ను ం డి యున్నతోద్యోగము నొందును. సర్వదా సంతుష్టాంతరంగుడైయుండును. పైచూపుగలవాడు తుదకుస్వస్థానమునందైనను ఘనతనొందును నవ్వునపుడు కంటిరెప్పలు రెండును మూల్కొఘువాడు చోరుడగు, కొన్నితావులందు వ్యావహా

రిక ఆధ్యాత్మికములందు తన్మయుడని ప్రశస్తినొందును. ఇట్లు పరబ్రహ్మచే సృజింపబడిన బహువిధచేతనులయొక్క దృక్కులను. చతురలోకాగ్రమనస్కులై విషయసేకరణను చక్కని తెలియగున యోచించుచు ఫలములను లోకులకు వ్యక్తపఱచుట క్రమపద్ధతి, నిక్కినిక్కి చూచువాడు విషయములను పసిపట్టువాడగును. కొలదికాలమున పంభవించు మంచిచెడ్డలను గ్రహించువాడుకాగలడు. స్వల్పవ్యవధిలో ముందుజాగ్రత పడువాడగు. అట్టిమానవుడు విశ్వాసపాత్రుడగును. తిన్నగచూడక దెసలను, భూమ్యాకాశములను జూచువాడు స్థిరుడుగాక వికారస్వభావుడై యుండును. నిర్హేతుకానుమానములకులోనై భయమునొందుచుండును.

A 1. కంటియాకారము, 2. సౌష్టవము, 3. తెల్లగుడ్డుపై పూర్ణాకృతినొందిన రక్తరేఖలు (జీరలు) 4. నల్లగుడ్డు యొక్క రంగు, 5. తారకావర్ణమును గ్రహించి ఫలము తెలుపునది. కంటి క్రింది రెప్పయొక్క తుదనుగల వెంట్రుకలు పైరెప్ప తుదనుండు వెంట్రుకలును ఎత్తుగనుండుటవలన సర్వవిధముల యోగప్రదములు. అట్టియెత్తు తగ్గుచున్నకొలదియు, యోగము తగ్గుచు నవయోగములు హెచ్చుచుండును. వెంట్రుకలే లేనిచో గతినాత్ముడు, నిర్భాగ్యుడు నగును. నల్లగుడ్డు శ్వేతవర్ణముకలదైన, సుందరసౌష్టవ దేహవంతుడయ్యు దూరప్రదేశములకేగి నీచవృత్తి నవలంబించవలసివచ్చును

4. (a) వ్యావహారికాధ్యాత్మికజ్ఞానములు, (b) శిరస్సు (c) పైరెప్పయొక్క తుదివెంట్రుకలు.

మానవునకు భృకుటిద్వయ ముండును. అట్టి బొమలపై సహజముగ వెంట్రుకలుండును. సుషుమ్నాస్థానము నుండి కణతలవఱకు బొమవెంట్రుకలు సహజముగ నుండును. అవి సుషమ్నానుండి ప్రారంభమై భ్రూమధ్యకిరుభాగముల తఱచై అనంతరము మధ్యభాగమున వైశాల్యమునొంది కణతలవఱకుగల కేశవ్యాప్తి రానురాను సన్నగిలును. అట్టి వెంట్రుకలు మృదువుగ నున్నచో వాగ్ధార కలిగియుండును. నిష్కపటియగు. సదయహృదయుడగు. జనామోదహాస్యముల నుడువుచుండును. జనానురంజకు డగును. అట్టివెంట్రుకలు కఱకుదనముకలిగి, నిక్కియున్న వికట సంభాషియగు. మోటుగ వర్తించువాడగును. రసహీనుడై యుండును. కండ్లరెప్పలనుండి బొమయొక్క యుపరిభాగమునకు వ్యాపించిన వెంట్రుకలు మార్దవము కలిగియున్న విశేషప్రజ్ఞావిజ్ఞానములు కలిగి యితరుల బాధింపనిరీతిలో వ్యావహారికాధ్యాత్మిక వేత్తయై, భక్తితో, నిత్యనైమిత్తికముల సకాలమున నెఱవేర్చుచు, ధీరోదాత్తగుణములుకలిగి విరాజిల్లును. ఆ వెంట్రుకలు కఱకుదనముకలవైన పుణ్యపాప విచారహీనుడై చరించువాడగును. కార్యసాధన వివిధ వ్యావహారి కాధ్యాత్మికస్థితుల యందు సాధించువాడగును. జంకుగాని సిగ్గుగానిలేక గొప్పతగువరివలె చరించువాడగును. తడబాటులేక భాషించువాడగును. శూన్యకేశభృకుటియగువాడు కఠినాత్ముడై పరుల

కష్టములజూచి జాలినొందడు. కొన్నిపట్టుల సన్యాసియై అన్న మయకోశోద్భూతజీవులు కర్మాయత్తులై కర్మానుభవజన్ములని భావించుచు, ప్రాణమయకోశసంజాతజీవులు సత్కర్మానుష్ఠానపరులైన వారినిజూచి నామోదించుచు, మనోమయకోశమున జనించి జ్ఞానులగుదురు. (తపోబలమున నన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ, రూపపంచకోశములద్వారా యద్వైతసిద్ధి నొందుదురు) బొమల మధ్యభాగమున పైరెప్పనుండి నుదుటియందు అల్పభాగము కేశవ్యాప్తమైన, మార్దవమునందిన యట్టినరుడు సుగుణాలవాలుడుగ పరిగణింపబడును. అట్టివారిచేతలు సర్వమానవానుకూలములుగ నుండును. అట్టి వెంట్రుకలు కఱకులై సూకరకేశములవలె నున్న దారుణ వ్యవహార వేత్తగను, ఘనతకై పుణ్యకార్యములలో భాగస్వామిగనుండును. భ్రూకేశములు పైవిధమున వ్యాపించిన వ్యావహారికవివేకము, ఆధ్యాత్మికబుద్ధి, కర్మాచరణప్రియుడుగ నుండును. బొమలపై వెంట్రుకలు లేక తలచిన్నదైన పిచ్చివాడగును. చిన్నతలయందలి మేధాస్థానము దేహానివృత్తికనుగుణముగనుండదు. తలపెద్దదైన, సూక్ష్మబుద్ధి క్రియాచాతుర్యము కలవాడగును, విశాలనయనములు, పెద్దతలకలవాడు ఇతరులు గ్రహింపలేని నూతనవిషయగ్రాహియగు మేధావంతుడగును. అథవా! యున్మాదియైననగు, తలపెద్దదియు, అల్పశరీరసౌష్టవము కల వ్యక్తి యజీర్ణమువలన వివిధశారీరక రోగముల ననుభవించును. స్థూలదేహము, అల్పశిరస్సు కలిగిన దూరదృష్టి లేని

వాడగు. భోజనప్రియుడును, చెప్పుడుమాటలలోని సత్యాసత్యముల నెఱుంగలేక ద్రోహులకును, వంచకులకును వశుడగును. గజాంతైశ్వర్యవంతుడును, నిర్ధనుడు కాకతప్పదు. నిర్మలమనస్కుడయ్యు మోసగింపబడినవాడుగాన ద్రోహులను దూషించుపద్ధతి నొందును.

మానవుల పై రెప్పలయందు మయూరపింఛపురంగు కలిగి కన్నులెగసి చూడ్కులందు కేశాగ్రభాగములు మొదటివాలును చెందిన, నిత్యదరిద్రగృహమునగాని, తాత్కాలిక దారిద్ర్యావస్థయందునుగాని జనించినను కుబేరతుల్యధనవంతుడు కాకతప్పదు. అట్టివాడు గురితప్పి యెట్టిపనినైన జేయడు. భోగియు, వదాన్యుడు, ధార్మికుడు, ఔదార్యవంతుడును నగును. పై కెగసిననీలవర్ణకేశములు కలవాడమాయకుడుగను, ఘనకార్యకర్తయను పేరొందినవాడుగను, శాశ్వత దానధర్మాదులాచరించి శాశ్వతముగ తననామమును నిల్పుకొనువాడుగను, స్వార్థరహితముగ నెట్టికార్యమునైన నెఱవేర్చి, సూక్తుల బోధించుచు, మోక్షసిద్ధికై సర్వశక్తుల నుపయోగించును. స్వీయసర్వశక్తుల క్రోడీకరించి, బుద్ధిమంతుడనియును నూతనాంశములతో భాష్యమువ్రాసి, మేధస్సమూహమూర్తియని సామాన్యులచే భావింపబడునట్లు వర్తించువాడగును. బొమవెంట్రుకలు, మేఘవర్ణముకలిగియుపరిభాగమునకువాటము జూపిన బాల్యమునకొంటెపనులు చేసియు, పిమ్మటకూరులశిక్షించును! దుష్టస్వభావులగు సన్నిహితులగూడ దరి జేరనీయడు. గురుబాధ్యతతో, ధర్మాధర్మముల శిష్యులకు ప్రబోధరూప

మున నుపదేశించువాడగును. అట్టిసచ్ఛిష్యప్రబోధమూలమున లోకులఁ దర్శింపజేయును. అట్టివాని శరీరసౌష్ఠవమునకుగాని, సద్గుణసంపదకుగాని ముగ్ధులై యేభావముకలవా రాభావముల గ్రహించి వినోదచిత్తులై వశ్యులగుదురు. అట్టివాడుజీవన్ముక్తుడగును. అట్టితరి కేశాగ్రము లుపరిభాగకు వాటమునొందక, ధైర్యమునొంది, విరళముగనున్న, ఉదారుడు, భోగియునై వినోదముగ జీవితమును గడుపువాడగును. బొమవెంట్రుకలు కురుచలైన సేవకుడగు. (వ్యావహారికోద్యోగి) ఆ కేశములు మిగులకుఱుచలైన నల్పోద్యోగిగను, శూన్యములైనఁ గఠినాత్ముడుగను, కఠినచర్యల నాచరించి జీవించువాడునగు.

## —: కార్యస్థానము :—

కార్యస్థానమన నాసిక. నాసాదండము క్రమమైన యెత్తుకలిగియుండవలెను. అట్టిదండెయందు నిమ్నోన్నతములులేనిచో మానవునిజీవితమునఁ గ్రమవృద్ధికలుగును. దండె, క్రమక్రమముగ కుడివైపువాలును,క్రమోన్నతమును కలిగియున్న విశేషరాజయోగమునిచ్చును. అట్లే వాలు వామభాగగతమైన, నవయోగము అట్టితరిగూడ, దండె క్రమోన్నతమునొందుచున్న యుద్ధతినిగూడ వామపార్శ్వమునకు జూపువాలు యోగహీనముగావించును. ఉన్నతి, భంగములనేగాక, పెక్కుడుమలతోడి బాధ్యత నధికముగావించుకొనుట తటస్థించును. దండెయందు హెచ్చుతగ్గులున్నచో జాతకుని జీవితమంతయు నొడుదొడుకులతో నిండియుండును.

1) దండకరేఖోన్నము (2) కుశీయోగమలకు వాలులు.
(3) నాసాగతనివోన్నతములు. వీనిననుసరించి రాజయో
గాదయోగముల నిదానించి ఫలనిర్ణయ మొనర్చునది.
కోలేరుముక్కు, యోగప్రదము. నాసికదీర్ఘముగనున్న
యోగదాయకము. కొంతకాలమునకైన యోగానుభవము
లభ్యము. నాసాగ్రము సూదివలెనున్న పౌరుషయోగము.
అట్టివాడు ఘనకార్యసాధకుడగు.

—: పరిచితి :—

పెదవి, పరిచితిని సూచించు స్థానముని వ్యవహారము.
(a) పెదవి రక్తవర్ణముకలదైన సామాన్యసంసారిగను, ఉదార
గుణసంయుతుడునగు. (b) గులాబీరంగుకలిగియున్న, నాటక
ములు, సంగీతసాహిత్యములు, వీధినాటకములు, నాటకరచ
నయు, పురాణపఠనము, సామవేదగానము, శిల్పము. చిత్రపట
నిర్మాణము, సహజసారస్వతవేదియు, సూక్ష్మగ్రాహియు,
లాలితసరతయు, శృంగారకావ్యపఠనము, చర్మభస్త్రికానట
నలు, తౌర్యత్రికయుతభాగవతములు, బహుభాషలలో కవి
త్వశక్తియు, కలవాడై, పలువురతో భుజించుచు, క్రీడా
పరాయణుడై, సుఖసంతోషములతో జీవితమును గడుపువా
డగును. అట్టివానిగృహముశ, కాలానుగతసంపదయు, పరి
కరములును సమృద్ధముగనుండును. సర్వవిషయములందును,
తనవిజ్ఞాన, ముపయోగపఱచును. కొద్దిమంది యాశ్రితుల
కైనను ఏదియోనెపమున విస్తవిని యోగము గావించును.
వ్రతాదులయందు సహనముకలిగి సుఖజీవిగానుండును. ఇట్టి

వాడు ఇతరుల దర్శనమాత్రముచే నాకర్షించును. రక్తవర్ణ ఓష్ఠములుకల మానవునితో నితరులు కొలదికాలము ముచ్చటింప నాకర్షణకలుగును. (c) పెదిమలు తెల్లగనున్నచో నజీర్ణము మొదలగు రోగములకు లోనగును. స్వస్థతలేని సంభాషణ కలిగియుండును. క్షణక్షణము విసుగునొందుచుండును. ఇతరులయాస్తి తనకు సంక్రమింప కొలదికాలమనుభవించగ, నది నిష్కారణముగ మాయమగును. స్వల్పాతిస్వల్పముగనుండువృత్తి విశేషముగ వృద్ధిజెంది లాభించును. ప్రథమమున భాషాంతరుల సంస్థయందు స్వల్పవేతనములొందుతరి రెండుమారులు మార్చబడిపిమ్మట స్వభాషాసంస్థయందు సామాన్యోద్యోగియై హఠాత్తుగ నధికవేతనము వృద్ధినొందగలుగును. (d) వివిధవర్ణములతోనున్నవానిజీవితము, వివిధప్రదేశములలో సంచరించుచు, పెక్కుచోట్ల జీవనాధారమునకై వృత్తినార్జించి ఉదరపోషణముకావించుకొనును. ఏదియోలోపము జీవితమునఁ గానబడుచుండును. (e) పీతవర్ణము (పసుపు) కలిగియున్నచో, శ్రోత్రియముగ జీవించువాడైనను తాత్కాలిక రుగ్మతలతో జీవితమును గడపువాడగు. నిత్యమేదోయొక శ్రమకు లోనుగాకతప్పదు.

నలుపు :—నీలవర్ణములైన పెదవులుగలవాడు, దురదృష్టవంతుడై చర్మరోగమునుగాని, దారిద్ర్యమునుగాని, ఆధివ్యాధులలో నొకదాని ననుభవింపకతప్పదు. సాము

దాయకాభిప్రాయమును ముఖ్యముగ గమనింపవలెను. పెదవులు మృదువులైన యోగప్రదము పెదవు లెట్టివర్ణము కలిగినవైనను, మార్దవమును కలిగియుండవలెను. కాఠిన్యమునొందిన, చర్మవ్యాధులుకలవాడగు. బీటలువారిన చర్మరోగమును, దారిద్ర్యమును నొందును, అట్టివానికొకవేళ ధనమున్న ననుభవము లేకుండును. 1 దవుడలు. 2 గడ్డము (చుబుకము).

(1) దవుడలు :—సౌమ్యదళవర్తులా? ఉబ్బినవా? చొచ్చుకొనియున్నవా? యని మొదట విమర్శించునది. సౌమ్యదళము (దళసరి) కలవాడు, మిగుల, నుదారుడుగ పరిగణింపబడును. ఉబ్బినదవుడలుకలవాడు, తానుకంఠపూర్తిగ, షడ్రసోపేతముగ భుజించుటయేగాక ఇతరులకును షడ్రసోపేతముగ భోజనము పెట్టువాడగును. బద్ధకము బుద్ధికలవాడును, దూరాలోచనలేనివాడును, తాత్కాలికయోచన ననుసరించివర్తించువాడునగు. సౌకుమార్యానందము లనుభవించును, చప్పిదవుడలుకలవాడు, పెక్కుమనోరథములునొంది యొకకోరికనైన, నెరవేర్చుకొనలేడు. ఎంత బుద్ధివాడైనను, కార్యసాధకమేధకలవాడైనను కార్యములు ఫలింపక, వృథాప్రయాసము, ధననష్టము నొందును. చప్పిదవుడలకుతోడు, జనసామాన్యముకన్న, మిగుల దీర్ఘకాయుడైన సప్తవింశద్వర్షప్రాయమున జనకునకు అంత్యక్రియల నాచరించువాడగును. కొన్నివత్సరములు, పరగృహావాసము, పరాన్నభుక్తియుఁ జేయవలసివచ్చును. అట్టిస్థలము

లలో నిట్టివారు ముసాబరులవలె వసింతురు. అట్టిచోటులలో చేబదులుగ ధనముఁ దెచ్చుకొనుచు సకాలమున నీయలేక హితులకును, వ్యవహితబంధువులకును వ్యవధిపైఁ దీర్చుచు వ్యవహరించును. సన్నిహితులఋణముతీర్చక (అపహరించి) తగువరివలె చరించుస్వభావముకలవాడగును. తనకక్కఱ కలిగినపు డిచ్చకపుమాటలచేఁ బొంగించి, తుదకు తుచ్ఛ జీవితమును, మోసపువృత్తి నవలంబించువాడగును. ప్రథమ కళత్రము నష్టమగును, మరలవివాహము చేసికొనును. ఇట్టి వానికి సత్యమనునది జన్మలోనేయుండదు. బూటకము, ద్రోహకార్యములతో దినముల త్రోసిపుచ్చుచుండు. బాల్య మునసే సన్నిహితుల స్వర్ణమపహరించును.

(2) గడ్డము:—పాదాదిశిరఃపర్యంతమైన దేహమున నీయంగశాస్త్రానుసారములైన, ద్వాదశభావఫలములకనువగు, రాజయోగాదులసూచించు, నంగసౌష్టవాదులు, రేఖలును, గానవచ్చినచో, శేషయోగములను గడ్డముపూర్తిఁజేయును. చుబుకాగ్రము నిశితముగనుండి, సౌష్టవయుతమైన రాజ, రారాజబిరుదాంకితులై యుత్కృష్టస్థానముననుండి కాలము గడపువాడగును. గడ్డము తుదిభాగ సూదివాటులో దిమ్మ వలె కొంచెముకానఁబడిన రాజాధిరాజై భువినేలగలడు. గడ్డపుతుదిసూదివాటుగనున్న రజస్తమోగుణములు కలవా డగును. చుబుకాగ్రము సూదివాటును, దిమ్మగనున్న రజో గుణమును, కొలదిగనున్న సాత్వికగుణమును కలవాడగును. చుబుకాగ్రము వర్తులముగనున్న సాత్వికవ్యాపారియగును.

ఇట్టిరీతులలో శాస్త్రీయపూర్ణప్రవృత్తి రాజయోగముల యందును, అందేదిలుప్తమైన ముద్రాధికారమును కాక తప్పదు. అంగశాస్త్రీయరాజయోగచిహ్నములలో న్యూనత ననుసరించి మొహరు, సీలు, మొ॥ ఉద్యోగములు చేయు వాడగును. అనగా నన్యులయాస్తికి తాత్కాలిక సర్వాధి కారిగనుండకతప్పదు. (కోర్టు ఆఫ్ వార్డ్సు) న్యాయస్థాన నిర్ణీతసంరక్షకుడుగ నుండకతప్పదు. నేటికాలమున భూసం బంధమైన కౌలుపద్ధతులుగూడ నిందు చేరగలవు. చుబుకా గ్రము దీర్ఘముగనున్న అంగశాస్త్రీయభావములలోఁ గొన్ని రాజయోగములు వర్తించినచో (లేక) ఈప్రకరణాంతర్గత స్థానములలో గొన్నియైన స్వాభావికముగ వర్తించినచో పరులయంత్రములను లోకప్రతారణకొఱకు నడుపుచు, యంత్రాధికారులకడ లేనిపోని మెప్పుల నొందువాడగును. అట్టివారు ఘనులను గర్వము కలిగియుందురు. చుబుకము హ్రస్వాకృతిగలదైన లోభియగును. అనుమానియై యెట్టిస్థితియందైన నేకాభిప్రాయమును నిలు కడగ నొందనివాడును, కష్టజీవియు, అనృతభాషియు, విశ్వ సింపనిస్వభావముకలవాడుగ, నుండును. విద్యావిహీనుడై పరుల చేనిందింపబడువాడగును. పైనుదహరింపబడిన మొత్తముస్థానము నందలి నియమములలో నధికసంఖ్యను జెందవలెను. అట్టివి సౌమ్య, సరళ, సౌష్టవాదులను గలిగి యుండవలయును.

---

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 11 | రర్త | రక్త |
| 2 | 18 | జనసము | జననము |
| 3 | 13 | కౌగాగొని | కౌలుగాగొని |
| 3 | 14 | నామంతుడు | సామంతుడు |
| 4 | 2 | శస్తు | శిస్తు |
| 4 | 19 | 19, 18 పంక్తుల మధ్య విడిచి పెట్టినది | A,B,C,D వర్తనలు తగ్గియుండి యల్పరక్త వర్ణము కలవైనచో చిన్న చెరువు లాధారము గలవై |
| 5 | 3 | స్తిరాస్తి | స్థిరాస్థి |
| 7 | 15 | వివిధవర్ణత్వము | వివిధవివర్ణత్వము |
| 10 | 21 | వివాదరహితము | వివాదసహితము |
| 11 | 15 | శూన్యమైన | న్యూనమైన |
| 12 | 19 | కాకరవర్ణ | కాకవర్ణ |
| 13 | 2 | నిమ్నార్ధ | నిమ్నార్థ్వ |
| 16 | 12 | చేరున్న | చేర్పున |
| 19 | 2 | ◡ | G |
| 19 | 15 | సత్యాకృతి | సవ్యాకృతి |

| పుట | పం_క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 19 | 16 | ఆధారముండును | ఆధారములుండును |
| 19 | 21 | రేయును | రేఖయును |
| 21 | 16 | దళమునున్న | దళమున్న |
| 23 | 3 | వ్యాప్తపరులు | వ్యాప్తిపరులు |
| 23 | 10 | నాయక | నామక |
| 23 | 15 | సామాన్య | సామాది |
| 31 | 17 | అక్లే | అట్టి |
| 32 | 18 | శ్లాభ్య | శ్లాఘ్య |
| 51 | 3 | పిత్రో | త్రో |
| 52 | 6 | పటా | పుటా |
| 55 | 22 | కనత్ర | కళత్ర |
| 59 | 6 | పంభవించు | సంభవించు |
| 63 | 2 | దర్శింప | దరింప |
| 66 | 18 | బుద్ధివాడైనను | బుద్ధికలవాడైనను |
| | | పీఠిక | |
| 4 | 8 | యంతరించినవి | అవతరించినవి. |
| 8 | 1 | మారసంభవాది | కుమారసంభవాది |
| 10 | 1 | 24 వ | 24 వ పద్యమున |
| 13 | 15 | తిలకంబుతిర్చి | తీర్చి |
| 14 | 15 | విషయములమ | విషయములను |

శ్రీనివాసా ప్రెస్, రాజమండ్రి.

# గ్రంథనిర్మాత అంశచక్రము.

ఉదయము 17 ఛాయలుకాగా జననము.

| | | |
|---|---|---|
| | రా॥ కు | బు |
| గు॥ శ | | |
| ల ర చం | కే | శు |

ఈ జాతకమును విశాఖజిల్లా శృంగవరపుకోటతాలూకా కోనంగిగ్రామమున పండితసమక్షమున శ్రీ చిట్టిబాబు పంతులుగారి మేనమామ శ్రీ నండూరి అప్పలనరసింహారావు పంతులుగారిచే గుర్తింపబడినదై యున్నది.

---

శ్రీ శ్రీ ముదునూరి చిట్టిబాబు పంతులుగారి
సముఖమునకు

"ప్రేమకుటీర"
హుకుంపేట,
విజయనగరము.
4—7—56.

మీరు దయతో పంపిన "అంగశాస్త్రము" పార్టు II అందినది. ఈ రెండు అధ్యాయములున్ను చదివితిని. ఎంతయు ప్రశస్తముగానున్నది. ఈ మీకృషి మిక్కిలి ప్రశంసార్హము. నా హృదయపూర్వకమగు అభినందనములు,

ఇట్లు,
మిత్రుడు
(Sd) తిరుమల నరసింహాచార్యులు.

నాచే రచింపబడిన గతమూడు అంగశాస్త్రభాగము ("శ్రీవీరభద్రరాయ" అంగశాస్త్రముతో సహా) లందలి, యీ శ్రీ సీతారామ లక్ష్మణాంబికాంగ శాస్త్రమునందలి పారిభాషిక పదములను చదువరులు వాడుకొనుచు, సాధకులు ఫలితములను లోకమున, శోధనాను క్రమమున వ్యక్తపరుచుచు లోక కళ్యాణము గావించి నాకానందమును జేకూర్పగోరినాను. తమతమ శిష్యకోటికి యీ నవీన శాస్త్రమును బోధింపవచ్చును. నా పరిశీలనాంశములపై ననుభవమున పండితులు, చదువరులింకను పరిశీలనలను గావించి, వారలనుభవములను గ్రంథముగా నొనర్చుదురని నాజీవితశేషకాలమందు, నా యనంతరమున కూడా నాశించుచున్నాను. ముద్రణాగారముల నొందిన నాగ్రంథముల యందలి ఫలిత నిర్ధారణ జేయు విధానములను ఎత్తి వ్రాసుకొనవలెనన్న నా పూర్తి నామము నాచే రచింపబడిన గ్రంథ వివరనామము ప్రారంభాంత్యపుటలు, పేరాలను పేర్కొని, వాడుకొనుట నా అంగీకారము.



తదితర దేశభాషలందు చైతన్య సూన్యత నొందినవారైనగుటచే అట్టి భాషలందు భాషాంతరీకరణ, వ్యాఖ్యపురస్కార రూపములను తర్జుమాలు వ్రాత రూప గ్రంథములలోగాని, ముద్రణ రూపములలోగాని చేయునర్హులు కారు.

విధేయుడు,

**ముదునూరి చిట్టిబాబు పంతులు**

---

మీరు వివిధ వైజ్ఞానిక ప్రశ్నల వాస్తు, గణితశాస్త్ర సంబంధమైన కేరళము, అంగశాస్త్రానుసార ఫలితములు మరియు వారు నా అడ్రసుకు వ్రాయండి.

అడ్రసు :

**పండిత శ్రీ ముదునూరి చిట్టిబాబు పంతులు**

రామచంద్రపురం టవున్

తూర్పుగోదావరి జిల్లా.

శ్రీనివాస ప్రెస్, రాజమండ్రి. ప్రతులు 1000.